# సంస్థానాలు






"స్వరాజ్యము నాజన్మహక్కు"

శ్రీ రామా బుక్ డిపో
బుక్ సెల్లర్స్ & పబ్లిషర్స్
4000, మార్కెట్టు
సికింద్రాబాద్

రచయిత
వావిలాల గోపాలకృష్ణయ్య

# ఒక మాట

మారుమూల పల్లెల్లో, నిత్యం ఏదో ఉద్యమంలో పరుగులెత్తే నాబోటి ప్రజాసేవకుడు ఈలాంటి పుస్తకం తలపెట్టడం సాహసమే! ఈలాంటివి వ్రాయడానికి ఎన్నో నివేదికలు, పత్రికలు, పెద్ద గ్రంథాలయం, దేశానుభవం ఉండాలి.

నేను జనవరిలో ఆంధ్రరాష్ట్రంలో చేసిన 'ఫెడరేషను: సంస్థానాలు' ప్రచారయాత్ర సందర్భంలోనూ, ఫిబ్రవరి నెలలో తాలూకాలో నిర్వహింపబడిన సత్తెనపల్లి తాలూకా రాజకీయ పాఠశాలలో ఉపన్యాసాల కొరకున్నూ అప్పుడప్పుడు వ్రాసికొనిన నోట్సు ననుసరించి నాయోపినంతగా దీన్ని వ్రాశాను. పొరపాట్లు మన్నించ ప్రార్థన.

ఈ పుస్తకం అచ్చుగుటలో ఎక్కువ శ్రమ చేసిన సత్తెనపల్లి శ్రీ కృష్ణాముద్రాక్షరశాల శ్రామిక వర్గానికిన్నీ, ముద్రణంలో సౌకర్యం చూపిన మేనేజరు శ్రీ మారూరి రామలింగారెడ్డిగారికిన్నీ నేను కృతజ్ఞుణ్ణి.

ఇది ఏమాత్రముగానన్నా ఉపయోగ పడిందంటే సంతోషిస్తా.

సత్తెనపల్లి
౧౫-౩-౧౯౩౯

దేశస్వాతంత్ర్యాభిలాషి,
వావిలాల గోపాలకృష్ణయ్య

పేరుగాని, కీర్తిగాని, కాంక్షగాని లేక

సంస్థానాల్లోని భరించరాని హింసలకు

బలియైన పేరుతెలియని స్వాతంత్ర్య యోధులకు

నాకన్నీటిధార

?

# సంస్థానాలు

## ౧౮౫౭ విప్లవము

(ప్రచండముగ రేగుచున్న సిపాయీల తిరుగుబాటు తుఫానుయొక్క వేగమంతయు నొక్కసారిగవచ్చిపడి మన (ఆంగ్లేయు)లను తుడిచివేయకుండఅక్కడఅక్కడ అడ్డము నిలచి కాపాడిన యీచిన్న చిన్న చెక్కలుగ నున్న సంస్థానములే!)

—కానింగ్ (౧౮౫౬—౬౧).

వర్తకరీత్యా భారతదేశమున ప్రవేశించి ఆయా రాజ్యాధిపతుల పంచల బాసుతై వారి అనుగ్రహాదరముల వలన నివేశన స్థలములను, వాణిజ్యావరణములను ఆసిటించీయా కంపెనీ సముపార్జించుకొనెను. కుతంత్రములతో బలవంతులై, భారత రాజుల కప్పటికున్న అన్యోన్య విద్వేషములను, అంతఃకలహములను, పరస్పరాయాసములను కారణములుగ దీసికొని, ఆయారాజులపై లేనిపోని పెత్తనమును చేసెను. తెచ్చిపెట్టుకొనిన అధికృతను ప్రబలచేసికొని డల్‌హౌసీ కాలమునాటికి ఏరాజైనను సంతానహీనుడై యున్నను, లేదా సన్నిహిత వారసునుగాని లేకున్నను, అట్టి అవకు కనిపెట్టి వారసులులేనివారికి తామే వారసులమని ఆరాజుల

దత్తతాధికారము నొసంగుటయో లేదా రాజ్యమును ఆక్రమించుకొనుటయో ప్రారంభించిరి.

దేశములో చిన్న చిన్న రాజుల రాజ్యములను లాగుకొనుట, ప్రజలను పీడించుట, ధనమును ఆస్తిని దోచుకొనుట పరిపాటియై పోయెను. ప్రజలకు సహించజాలని అసంతృప్తి జనించెను. విదేశములలో రష్యావారికి ఇంగ్లీషువారికియుద్ధము సంభవించునట్లు కన్పట్టెను. అదేఅదనుగా దూరదృష్టిగల నానాసాహెబు, ఝల్లీ బేగం, ఝాన్సీలక్ష్మిబాయి, ఒకమహమ్మదీయ యువకుడును నాయకత్వం వహించి సిపాయి తిరుగబాటును 1857 లో నడిపిరి. అది భారత స్వాతంత్ర సంపాదనకుసాగిన విప్లవము. బ్రిటిషువారిని స్వదేశీ రాజులు తిరుగుబాటు చేసిరి. కొన్ని ప్రాంతాలలో గ్రామాధికారులు తిరుగుబాటు చేసిరి. వారికి ప్రాణరక్షణ కేర్పరచుకొన్న సిపాయీలును తిరుగుబాటు చేసిరి. ఆనాడాంగ్లేయులు ఇండియాపై నాశ వదలుకొనిరి. కాని దేశద్రోహులు కొందరు గావించిన కుట్రలవల్ల, కొందరు సంస్థానాధీశులు బ్రిటిషువారిశరణుచొచ్చుటచేత, విప్లవము నిర్మాణయుతంగా లేనందున అది విఫలమై పోయెను. చరిత్రకెక్కెను.

ఈ విప్లవముతో ఈస్టిండియా కంపెనీని రద్దుచేసి దానికి చెందియున్న భారతదేశములోని

ఆక్రమణలు, ఆస్తిపాస్తులు అధికారములు అన్నియు బ్రిటిషుపార్లమెంటుస్వాధీనపరచుకొనెను. సంస్థానాధిపతులువీరిదత్తతలు, రాజ్యాక్రమణఅర్హతలు కూడ బ్రిటీషుపార్లమెంటు కాజానకు వశమాయెను. ఈ సంక్రమణ సందర్భమున విక్టోరియారాణి నూతన రాజ్యాక్రమణ కాంక్ష లేదనియు తమదర్జాఅధికారం వలెనే, సంస్థానాధీశుల దర్జాలను అధికారములను గౌరవింతుమనియు పదులను వీరిపైకి రానీకుమనియు నుడివెను. ఏమిచెప్పినను ఆవంక ఈవంక పెట్టికొన్ని సంస్థానములను స్వాధీనపరచుకొనిరి. కొన్నింటి పరిపాలనను స్వాధీనపరచుకొనిరి

సంస్థానాధిపతులు పరస్పరంగా గాని ఇతర దేశాలతోగాని బ్రిటిషువారి ప్రసక్తిలేకుండా సంధులు చేసికోరాదు. 1914 వరకు సంస్థానం విడిచికూడా(?)పోరాదు. సంస్థాన పౌరుడు సంస్థానం దాటిన బ్రిటిషు పౌరుడుగ పరిగణింపబడును. అంతరరంగిక కలహములలో బ్రిటిషు ప్రసక్తిలేనిదే ఎట్టి చర్య తీసికో వీలులేదు. "మనగవర్నమెంటు పైకి ప్రకటించకపోయినా క్రియకు సర్వం సహాధికారియై యుండవలెను. సంస్థానాల నన్నింటిని నిజానికి దాసానుదాసులను చేసికోవాలె. వీటికి ఆంతరంగిక పరిపాలనాధికార ముండనిమ్ము. మన మిచ్చు రక్షణకు భద్రతకు ప్రతిఫలముగ ఈ

## నరేంద్రమండలి

ఇండియాకు 1919 లో ఇచ్చిన మాంటేగ్‌ఫర్డు సంస్కరణముల సందర్భమున బ్రిటీషుఇండియాలో కేంద్రప్రభుత్వము యేర్పడుచున్నది. కావున అటులే సంస్థానాధీశులకును కేంద్రసంఘముండుట అవసర మని నరేంద్రమండలి నొకదానిని నిర్మించిరి. ఇండియా స్టేటు కార్యదర్శి దీని రాజ్యాంగమునిర్ణయించును. దీనికి ఇండియా వైస్రాయిఅధికార రీత్యాఅధ్యక్షుడు (ఛాన్సలరు). సాల్యూట్సుగల సంస్థానాధీశులును, కొన్ని సంస్థానములవారు తమతరఫున సాముదాయకముగ నెన్నుకొనిన ప్రతినిధులును, వైస్రాయి నిర్దేశించిన వారును ఇందుసభ్యులు.

వీరు తమ అధికారములు, అవకాశములను ముఖ్యంగా సామ్రాజ్యసమస్యలలో తమకుగల స్థానమును చర్చించుచుండిరి. సాలుకొకమారుసమావేశమగు చుండిరి. సభ్యేతరులకు ప్రవేశం లేదు. కాని 1929 ఫిబ్రవరి నెలనుండి సభ్యేతరులును ఖాళీ యున్నచో రావచ్చుననిరి. కాని నరేంద్రమండలిలో ప్రజలకు ఖాళీలేదు.

బ్రిటిషు ఇండియాలోని పాలనలో ప్రజలు పాల్గొనుచుండ, పొలిమేరలోనున్న సంస్థానప్రజలు నిరంకుశ పరిపాలనకు, అంతుపొంతుచులేని పన్నుల

పద్ధతికి, అతి గతి లేని రాజ్యనిర్వాహణమును ఎన్నా ళ్ళని సహింపగలరు. వారిలో చైతన్యముప్రబలెను. అందుపై కొన్ని సంస్థానములలో ప్రభుత్వనియమిత సభ్యులుగల శాసనసభలను స్థాపించి ప్రభుత్వ ఉత్త రువులన్నియు, ఈ సభలద్వారా శాసనములనిపించి సంస్థానాధిపతులు ప్రపంచమును, సంస్థానేతరులను మోసగించ సాగిరి.

### రాజ్యాంగసంస్కరణ సంఘాలు

సంస్థానాధీశులయు, అచటి ప్రజలయు అభి వృద్ధి పరంపరలను - స్వాతంత్ర్య నిరోధములను కాంగ్రెస్ శ్రద్ధతో పరికించుచుండెను. 1927 లో చెన్నపురిలో జరిగిన కాంగ్రెస్ స్వదేశీ సంస్థానా ధీశుల, తత్ప్రజల అభ్యుదయమునకు సంస్థానములలో ప్రజాప్రతినిధి సంస్థలు, బాధ్యతాయుత పరిపాలన వెంటనే స్థాపింపవలెనని తీర్మానించెను.

1928 సం॥ ము మే 19 న బొంబాయిలో డా. అన్సారిఅధ్యక్షతను జరిగిన అఖిలపక్షమహాసభ భారతరాజ్యాంగ ప్రణాళికను తయారుచేయుటకు నెహూరికమిటీని నియమించెను. ఈకమిటీతో బ్రిటిషు భారతీయ ప్రతినిధులును, సంస్థాన ప్రజల ప్రతినిధు లును చర్చించిరి. కొన్ని సంస్థాన ప్రజాభ్యుదయ సంస్థలుకూడా వీరితో సంప్రదించిరి. ఈకమిటీవారు

అధిపతులే స్వాతంత్ర్యము కావలెననియు, సంస్థాన ప్రతినిధులును బ్రిటిషు ఇండియా ప్రతినిధులును గల ఫెడరేషను ద్వారా భారత రాజ్యాంగము నిర్వహించ బడవలెననియు అక్టోబరు 10 న నివేదికను ప్రకటించిరి. సంస్థానాధిపతులును బ్రిటిషు ప్రజలకును సంస్థాన ప్రజలకును మొలాకో - లోనంగిరి.

ఆ సంవత్సరమే సంస్థానాధిపతుల పరిస్థితులు విచారించుటకు ఇంగ్లాండు ప్రభుత్వాంచే నియమింప బడిన (సర్ హార్ కోర్టు) భట్లరుకమిటీవారు సంస్థానాధిపతులతము ఆధిక్యత నిల్పుకొనుచు ప్రజల కధికార మీయుట తప్పదనిరి. బ్రిటిషు ఇండియాయును సంస్థానములును రాజ్యాంగముగ సమ్మిళితముగుట వాంఛనీయమనిరి.

బ్రిటిషు భారత దేశమునకెట్టి రాజ్యాంగ ప్రణాళిక యివ్వబడవలెనో విచారించుటకు బ్రిటిషు పార్లమెంటుచే నియమింపబడిన సైమను కమీషను ఇండియాలో ఎల్లరు బహిష్కరించుటచే - తములో తామే విచారణ చేసికొని, అవసరమగు సందర్భములలో నెహూరు నివేదికను ఆధార పరచుకొని భట్లరు సూచనను ఆమోదించుచు సంస్థానాల ప్రతినిధులును, బ్రిటీషు ఇండియా ప్రతినిధులును ఫెడరేషను వేదికయందు చేర్చబడవలెనని 1929 లో నివేదించిరి.

## కాంగ్రెస్: సంస్థానాలు

1928 డిసెంబరు 29 న మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతను కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ మహా సభ స్వదేశీ సంస్థానములలో ప్రాతినిధ్య పద్ధతిపై బాధ్యతాయుత ప్రభుత్వము ప్రవేశపెట్టవలెననియు అందుకనుగుణగుణముగ పౌరసత్వ హక్కులకు హామీయిచ్చుచు తక్షణ మొక రాజకీయ ప్రకటన చేయవలసినదిగ సంస్థానాధీశులను కోరిరి. సంస్థాన ప్రజలయెడ సానుభూతి చూపెను. ఈ తీర్మానముతో సంస్థానప్రజల కొకింత ఉత్తేజము కలిగెను. సంస్థానాధీశులకును, బ్రిటీషు ప్రభుత్వమునకును హెచ్చరిక జనించెను.

ఇర్విన్ ప్రభువు 1929 అక్టోబరు 31 న బ్రిటీషు ప్రభుత్వాదర్శము ఇండియాకు అధినివేశ స్వరాజ్యమిచ్చుటయే యనెను. - ఎప్పటికో ? అందుకై రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు లండన్‌లో జరుగుననెను. సర్ మాల్కం హెయిలీ (తర్వాత సంయుక్తరాష్ట్ర గవర్నరు) ఇండియా ఇప్పుడే అధినివేశ స్వరాజ్యమును అనుభవించుచున్నదనెను. ఆ ప్రకటనలో కాంగ్రెసు కోరిన అధినివేశ స్వరాజ్యం నిరాకరింపబడెను. 1929 డిసెంబరు లాహూరులో జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతను

కాంగ్రెస్ సమావేశమై 1931 జనవరి 1న బ్రిటిషు వారి ప్రసక్తిలేని సంపూర్ణస్వాతంత్ర్యమే ఆదర్శ మని స్వాతంత్ర్యభేరీ మోగించిరి. ఆసభలోనూ కలకత్తాలో చేసిన సంస్థాన సంబంధతీర్మానమునే అనువదించిరి. ఆ సభలో జవహరిలాల్ నెహ్రూ మాట్లాడుచు ఎట్టిసభలకును తమపౌరులు ప్రతినిధిం చుటకు తగరని సంస్థానాధిపతులు తలంచుట తగదనెను. సంస్థానాధీశులు వారి ప్రజలు భారత ప్రజల నుండి విడవడ జాలరనిరి. ఏనాడును సం స్థాన ప్రజలు తోసివేయబడ జాలరనెను. 1930 లో కాంగ్రెసు స్వాతంత్ర్యసమరము సాగించెను. తీవ్రలాఠీచార్జీలు, కాల్పులు, అత్యాచారాలు ఎదుర్కొని 1931 లో గాంధి ఇర్విన్ ఒడంబడికను సాధించెను. ఈ లోపున 1930 లో మొదటి రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు లండనులో జరిగెను. అందు సంస్థానాధీశుల కిలకిలారావములు విన వచ్చెను, కాని సంస్థాన ప్రజల ఆర్తనాదములకు చోటులేకపోయెను. బికనీరుమహారాజు సామ్రాజ్య మైత్రి కొరకును, సార్వభౌముని యెడగల భక్తి చేతను ఫెడరేషనులో చేరుచున్నామనెను. కాం గ్రెసు ప్రతినిధిగ మహాత్మాగాంధి 1931 లో రెండవ రౌండ్ టేబిల్ సమావేశమునకు వెళ్లెను. గాంధిగారు జాతీయవాంఛను తెలుపుచు సంస్థాన

ప్రతినిధులు ఎన్నికల ద్వారా నియమింప బడవలె ననియు, సంస్థాన ప్రజల పౌరసత్వపుహక్కులు ఫెడరల్ రాజ్యాంగములో నుదహరింపక పోయి నను ఫెడరల్ కోర్టుకు విడిచి వేయవలెననిరి. యన్ సి. కేల్కారుగారికి వ్రాయుచు గాంధిగారు సంస్థా నేతరులు సంస్థాన ప్రజాఉద్యమములలో పాల్గొన రాదనిరి. సంస్థానాధిపతులు వారి ప్రజలకు స్వాం తంత్ర్య మొసంగుదురనియు, వారు ధర్మకర్తగ నుండి రాజ్యపరిపాలనను నిర్వహింతురనియు ఆశించు చున్నామనిరి.

ఇంగ్లాండునుండి మహాత్ముడు వట్టి చేతులతో తిరిగివచ్చెను. బ్రిటిషుఇండియాలో లాఠీఛార్జీలు తీవ్రనిర్బంధాలు ఆర్డినెన్సులు రాజ్యమేలెను. మూడవ రౌండ్ టేబిల్ సభ - ఏదో జరిగిపోయింది. ఎసెంబ్లీలో ప్రత్యక్షఎన్నికలతో ఫెడరేషనును ఉపపాదించుచూ 1933 మార్చి 1 న తెల్లకాగితం ప్రకటితమాయెను. నేటివైస్రాయి లిన్‌లిత్ గో ప్రభువు అధ్యక్షతను జాయింటు పార్లమెంటరీ కమిటీ ఫెడరేషనును అంగీకరించుచు ఎసెంబ్లీలో పరోక్షపు ఎన్నికలను, సంస్థానాధీశులే తమ ప్రతి నిధులను నియమించునట్లును సూచించిరి. ఆ సూచ నలు 1935 ఆగస్టు 2 న ఇండియా శాసనరూపం ధాల్చెను.

ఈ ఫెడరేషనులో రెండు శాసనసభలుండు ననియు నందలి స్టేటుకౌన్సిలులోని 250 మంది సభ్యులలో 125 సంస్థాన ప్రతినిధులును, ఫెడరల్ ఎసెంబ్లీలోని 375 మంది సభ్యులలో 125 మంది సంస్థాన ప్రతినిధులును, ఉందురని 18 (2) సెక్షను లోనుదహరించిరి. మొదటి షెడ్యూలులో సంస్థానా ధీశులచే "ఏరి నిర్ణయించిన" (Shall be chosen and appointed) వారే సంస్థాన ప్రతినిధు లని వ్రాసిరి. ఈ ఫెడరేషనులో చేరుటకు సంస్థానా ధీశులు తమకు అంగీకార పత్రమును ఫెడరేషనుకు గాక, సరాసరి ఇంగ్లు పార్లమెంటుకే వ్రాసియివ్వ వలెనట. ఫెడరేషనులో సంస్థాన విషయము లేవేవి చర్చింపనగునో అంగీకారపత్రములో సంస్థానా ధీశుడుదహరించునట. ప్రజలసాగతి ఆంతరంగిక పరి పాలన విషయము చర్చ చేయనేరాదు. ఈవిధముగ ఫెడరేషనులో సంస్థానప్రజల పౌరసత్వము, ఆర్థిక దురవస్థలు విస్మరించిరి.

సంస్థాన ప్రజోద్యమము

భారతదేశములోని 17,75,262 చతురపు మైళ్ళ వైశాల్యములోను 6,75,262 చతురపు మైళ్లు అనగా మూడవంతు వైశాల్యము నావరించి, 35,29,86,879 మందిలో 8,13,10,845 అనగా

దాదాపు ఐదవవంతుమంది నివసించుచున్న ఈసంస్థానములలోని ప్రజలు రాజకీయముగ మరపుతగిలి దన్నమాట. ఆర్థిక రాజకీయ కాంక్షలడుగంటి కొన్ని ప్రదేశములలో సభలకేని, మరికొన్ని ప్రదేశములలో దేవతాపూజలకేని, ఇంక కొన్ని సంస్థానములలో ఇక్కట్టులు చెప్పుకొనుటకేని, మరికొన్ని సంస్థానాల్లోప్రముఖులుఅడుగుబెట్టుటకేనిహక్కులు* లేక అలమటించుచున్నారు. అచటి ఆందోళన చేసికొనుటకు అవకాశము లరికట్టబడుచుండెను. కొన్ని సంస్థానములలో ప్రజాపరిషత్తులు ప్రారంభించి పని చేయుచుండెను. అచటి ప్రజాఉద్యమములు పలు విధములుగ అరికట్ట బడుచున్నవి. ఈనిర్బంధములు ప్రజలబాధలు సంస్థానములలోననేగాక బ్రిటిషు ఇండియాలోను ప్రచారము కాదొడంగెను. పత్రికలలో, బ్రిటిషు ఇండియాలోనిపత్రికలలో సంస్థానాధీశుల దుండగములు విరివిగా ప్రచారము కాసాగెను. సంస్థాన ఆవరణములలో సభలుచేసికో వీలు లేదన్న, సంస్థానాల ప్రజలు బ్రిటిషు ఇండియాలో సభలు చేసికొని తీవ్ర ప్రచారంచేసి ప్రజాభిప్రాయమును బలపరచుచుచుండిరి. ఏసంస్థానము కాసంస్థా

---

* హిందువులు రాజకీయ ప్రచారంచేస్తే మతవాదమన్న నైజాంగారి హైదరాబాదురాజ్యంలోకి ముస్లింలీగు అధ్యక్షుడుజిన్నాకూడా అడుగుపెట్టుటకు వేలులేదు. పరిచారం తగదన్నమాట.

నముకాక అన్ని సంస్థానములును కలిసి ఆందోళన చేయువలసిన ఆవశ్యకత గ్రహింపబడెను ప్రజలలో, బ్రిటిషు దేశంలో, బ్రిటిషు ఇండియాలో, సంస్థానములలో సంస్థాన ప్రజాఉద్యమ ప్రచారము సాగింప నిశ్చయించిరి.

"సంస్థానాధీశుల పాలనక్రింద ప్రజాప్రతినిధి సంస్థలమూలముగా సంస్థానప్రజలు బాధ్యతాయుత పరిపాలనబడయు" ఆదర్శముతో 1927 లో అఖిల భారత సంస్థాన ప్రజామహాసభ నిర్మాణము కావింపబడెను. వీలునుబట్టి అవసరమునుబట్టి, అవకాశమును బట్టి ఆయాప్రముఖుల అధ్యక్షతను ఆయాప్రదేశలలో మహాసభ సమావేశములు జరుగుచున్నవి.

అఖిలభారతసంస్థాన ప్రజామహాసభలు

| సభ | సంవత్సరం | ప్రదేశం | అధ్యక్షుడు |
|---|---|---|---|
| ౧ | ౧౯౨౭ | చెన్నపురి? | మోచర్ల రామచంద్రరావు |
| ౨ | ౧౯౨౯ | నాగపూర్? | సి. వై. చింతామణి |
| ౩ | ౧౯౩౨ | బొంబాయి | రామానంద చటర్జీ |
| ౪ | ౧౯౩౩ | బొంబాయి | యస్. సి. కేల్కార్ |
| ౫. | ౧౯౩౪ | ఢిల్లీ | జి. ఆర్. అభయంకర్? |
| ౬ | ౧౯౩౬ | కరాచీ | డా. భో. పట్టాభిసీతారామయ్య |
| ౭ | ౧౯౩౯ | లూధియానా | జవహార్‌లాల్ నెహ్రూ |

సంస్థానాధీశుల పాలనక్రింద ఆందోళన మొనరించుటకు ప్రాదుర్భవించిన ఈ మహాసభలు రాజకీయ

ముగ మంచి పలుకుబడి గలిగి ప్రజలలో ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యములకై అకుంఠితమగు ప్రచార పరిబోధముల సాగించెను. ప్రజలలోనూ, సంస్థాన ప్రజలలోనూ, నూతన చైతన్యం కలిగించెను. 1931 లో కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యము ప్రకటించిన వెంటనే, ఆసంవత్సరమే ఈ మహాసభ బొంబాయిలో సమావేశమై "శాంతియుతమైనట్టియు, సవ్యమైనట్టియు అన్ని సాధనలచే సంస్థాన ప్రజలకు సంపూర్ణ ప్రాతినిధ్యముగలట్టియు, ప్రజాయుతమైనట్టియు, ప్రభుత్వ సంపాదనమే తమ ఆదర్శమని" చాటెను. 'సంస్థానాధీశులపాలనక్రింద' అనుమాటను విడచి వేసిరి.

ఈ ప్రకటనతో సంస్థాన ప్రజలకు ఆశాజ్యోతి కాన్పించెను. తీవ్ర సంచలనం కలిగెను. 1933 లో బొంబాయిలో మహాసభ జరుగునప్పటికి, ఈలోగా జరిగిన ఆందోళన సంస్థానాధీశుల గుండెల అవియజేసెను, ఈ మహాసభ వారిగుండెలలో గాలమాయెను. బ్రిటిషు ఇండియాలో ఆర్డినెన్సులతో పరిపాలన చేయబడుచుండెను. సంస్థానాధీశులు వీరి అండజేరి బ్రిటిషుఇండియాలో జరుగుచున్న సంస్థాన ప్రజాఉద్యమాన్ని అరిగట్ట ప్రార్థేయపడిరి. అందుపై 1934 లో సంస్థానాధీశుల సంరక్షణ శాసనములు జరిపిరి. క్రిమినల్ ప్రొసీజరు కోడ్డులో 124

సెక్షను ప్రకారం బ్రిటీషు ప్రభుత్వానికివ్యతిరేకంగా వ్యవహరిస్తే రాజద్రోహమన్నారు. ఈ శాసనంతో సంస్థానాధీశులకు వ్యతిరేకంగా ఏమిచేసినా రాజ ద్రోహ మన్నారు. 5 సం॥ కఠినశిక్ష. సంస్థానాధీశులకు శాసనపూర్వకంగాకూడా రక్షణ యిచ్చారు.

సంస్థానాల ప్రజాఉద్యమం దినదినాభివృద్ధిగా సాగిపోతూనేవుంది. ఇటు ఈఉద్యమం సాగుచుండగా ఫెడరేషనులో సంస్థానాధీశులు కలియుటకు వ్రాసి యివ్వవలసినఅంగీకారపత్రమును 1936 జూలై నెలలో బ్రిటిషువారు ప్రకటించారు. అందుపై సంస్థానాధీశులు, వారిమంత్రులు బొంబాయిలో సమావేశమై 1937 ఫిబ్రవరి 19 న 'సార్వభౌమునితో సంబంధించినంతవరకు సంస్థానాధిపతుల హక్కులు బాధ్యతలు ఈ పత్రముకాని, దీనివలన యేర్పరుపబడు ఫెడరేషనుగాని భంగము కలిగింపకూడదనియు, రెసిడెంటు సార్వభౌముని ప్రతినిధిగ నుండవలెనేగాని, గవర్నరు జనరల్ ఏజంటుగ నుండగూడనియు, వైస్రాయి, గవర్నరు జనరల్ ఒకేవ్యక్తి యుండగూడదనియు' తెలియజేసిరి. మరల బ్రిటిషు ప్రభుత్వమునకు ఆసంవత్సరమే సెప్టెంబరు 28 న వ్రాయుచు 'ఇండియాఆక్టు ద్వారా ఫెడరేషన్ ప్రభుత్వమునకు అధికారమిచ్చిన మాత్రాన సంస్థానాధిపతులు బద్ధులు

కాజాలరని తమ అంగీకారపత్రములో నుదహరించ వలెనని కోరిరి. అంతటితో అప్పటి అంగీకార పత్రము అడుగంటెను. బ్రిటిషు ప్రభుత్వంవారు క్రొత్త ముసాయిదాను తయారు చేశారు.

సంస్థానాలలో బయలుదేరుచున్న ప్రజా ఉద్యమాలనుచూచి సంస్థానాధీశులు తమ ఉనికికే ఎసరువస్తున్నదని అర్థం చేసికోగలిగి తమనరేంద్ర మండలిని పునరుద్ధరింప దలంచిరి. వారి వారి హోదాలు - గౌరవాలు ఎక్కడ తగ్గిపోవునో యనిఅభిప్రాయభేదాలతో ఇన్నాళ్లు కలియనివారు ప్రజాఉద్యమబలం ఎక్కువైనకొద్ది వారిలో సంఘీ భావం ఎక్కువగుచున్నది. చివరకు 1938 నవం బరు 30 న ఒక ఒడంబడికకు వచ్చి తమ నరేంద్ర మండలిని సక్రమంగా నడుపదలంచిరి. 1939 జన వరిలో కొందరు సంస్థానాధిపతులు సమావేశమై తమ సంస్థానాలలో చెలరేగుచున్న విప్లవములను అణచుటకు తమ తమ బలముల నన్నింటిని కేంద్రీక రించుకో నిశ్చయించిరి.

అందు కీకార్యక్రమము నేర్పాటుచేసి కొనిరి. (1)సంస్థానములకు సమ్మిశ్రిష్టిపోలీసుండాలె, (2)ప్రజామండలులను వెంటనేనాశనము జేయాలె (3) న్యాయమైన ఇబ్బందుల తీర్చాలె (?) (4)విదే శాందోళకులపై తీవ్రచర్యతీసికొని వారిని సంస్థా

సమునుండి నిషేధించాలె. (5) సాంఘిక ప్రయత్న ములను ప్రోత్సహించాలిగాని, రాజకీయ యత్నము లను ప్రోత్సహించకూడదు. (6) సంస్థాన ప్రజల సలహా సంఘములను ప్రోత్సహించవలెను. (7) నిర్బంధ (అంటే ప్రజాఉద్యమము తీవ్రరూపం దాల్చి - ఇక సమాధానము పడక గత్యంతరంలేక పోతే) సమాధానము అవలంబిస్తూ ధైర్యంగాను స్థిరంగాను నిలచి ఉండాలె.

ఈవిధంగా నిర్ణయించుకొని ప్రజాఉద్యమ మును అణచివేయడానికి గొప్ప కుట్రలు పన్ను తున్నారు. గవర్నరుజనరల్ - లిన్‌లిత్‌గో మున్ను, అతనివెంట బికనీరు మహారాజా ఒకసంస్థానం తర్వాత మరొకసంస్థానంగా ఈ సంవత్సరంలో ప్రచారం చేస్తున్నారు. లిన్‌లిత్‌గో ఫెడరేష నులో సంస్థానాధిపతులు చేరవలసినదిగ బహిరం గంగానే ప్రచారం చేస్తున్నారు. ఇక బికనీరో 'బాధ్యత యెరిగి వుండాలిగాని, బాధ్యతాయుత ప్రభుత్వం యివ్వకూడదు, స్థిరప్రజ్ఞ కలిగి ధైర్యంగా వుండాలె. నిర్బంధ మార్గమును సమాధాన మార్గ మును అవలంబించి వుండడం 1908 లో మింటో 'గుద్దులు - ముద్దువిధానం' లో తెలిపియున్నాడు. కాబట్టి ఎప్పుడు నెమ్మదిగా వుండాలో ఎప్పుడు కటువుగా వుండాలో ఎప్పుడు రెంటినీకలిపి ప్రవర్తిం

చాలో ఎంతో నిపుణతమీాదగాని నిశ్చయించుకోవ డానికి వీలులేదు. పరిస్థితినిబట్టీ, సమస్యలనుబట్టి నిర్ణయించుకోవలసి వుంటుంది, ప్రజామండలులు రాజకీయ సంస్థలుగా సంస్థానంలోఏర్పడనివ్వకూడదు. ఇప్పటికే యేర్పడిన సంస్థల చర్యలను జాగ్ర త్తగ కనిపెట్టి వాటిని నిషేధించి వేయాలె. ప్రజా మండలులను ఫలానివిధంగా అణచివేయాలెనని చెప్పవీలులేదు కాని ఏ సంస్థానమునకు ఆసంస్థానమే విధానం యేర్పరచుకోవాలెనని తీవ్రంగా ప్రచా రం చేస్తున్నారు. ప్రజాఉద్యమమును అణచివేయు టకు తీవ్ర ప్రయత్నాలు సాగిస్తున్నారు.

### ప్రజల కోర్కెలు

ఫెడరేషను సమస్యతో సంస్థాన ప్రజలకును బ్రిటిషు ఇండియా ప్రజలకును రాజకీయ సన్నిహిత సంబంధము తప్పక సరియాయెను. 7 కోట్ల ప్రజలకు ప్రాతినిధ్య హక్కులేని ఫెడరేషనును, 28 కోట్ల ప్రజలకు ప్రత్యక్ష ప్రాతినిధ్య హక్కులేని ఫెడరేష నును, భారతదేశమును తరతరములవరకు పరా ధీన మొనర్చు వానిన ఫెడరేషనును ముక్కలు చేయుక తప్పదు. అందుకు ప్రజలు తీవ్రముగ నాలో చించుచుండ వైస్రాయి లిన్లిత్ గో ఫెడరేషను అమలు జరుపుటకు సంస్థానాధీశులతో మంతనము లాడుచున్నాడు.

ఈపరిస్థితులిట్లులుండ లక్నోలో 1936 ఏప్రిల్ 11 - 14 లలో జవహరిలాల్ అధ్యక్షతను కాంగ్రెస్ సమావేశమై "ఇండియారాజ్యాంగము ఎవరో నిర్ణయించునది కాదనియూ, ప్రజామండలి (కాన్స్టిట్యుయెంట్ ఎసెంబ్లీ) నిర్ణయించవలెననియు శానిసఫెడరేషను పనికిరాదనియు, బ్రిటిషుఇండియా లోని ప్రజలకెట్టిహక్కులు కావలెనో అట్టిహక్కులు సంస్థానప్రజలకును కావలెననియు, సంస్థానములలోని ఉద్యమములు అచటివారేనడుపవలెన"నియు తీర్మానించెను.

లక్నోకాంగ్రెస్ తదనంతరం 1936 జులై 18,19 లలో కరాచీలో డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి అధ్యక్షతను సమావేశమైన ఐదవఅఖిలభారత సంస్థాన ప్రజామహాసభ 'శాంతియుతమైనట్టియు, సవ్యమైనట్టియు అన్నిసాధనలచే సమ్మిళిత (ఫెడరల్) భారతదేశంలో అంతర్భాగంగా సంస్థానప్రజలకు సంపూర్ణ బాధ్యతాయుత పరిపాలన సంపాదించుట మహాసభ ఆదర్శము' ని నిర్ణయించిరి. అంతటితో అఖండ భారతయత్నములో కలిసిపోయినవిగి.

ఈ సభజరిగిన తర్వాత ప్రజల నూతన చైతన్యం పాదుర్భవించెను. అనేక సంస్థానాలలో ప్రత్యక్ష పోరాటాలు జోరుగాసాగెను. ప్రజలు తీవ్రనిర్బంధాలకు గురియైరి. అట్టి నిర్బంధాలను అందు

సంస్థానాధీశుల నిరంకుశ చర్యలను ఖండిస్తు కాంగ్రెసు కార్యవర్గం తీర్మానించెను. అందుపై గాంధిగారు అదిసరికాదని హరిజనలో హెచ్చరించిరి. ఈ సందర్భాలను చర్చచేయడానికి నవసారిలో డా. పట్టాభిగారి అధ్యక్షతను 1938 ఫిబ్రవరి 14, 15 తేదీలలో సంస్థానప్రచారకుల సమావేశము (స్టేటువర్కర్సు కన్వెన్షను) జరిగెను. అచటకాంగ్రెసే సంస్థానాల ప్రత్యక్షపోరాటంలో పాల్గొనవలెనని వర్కరులు తీవ్రంగా ఉద్బోధించిరి. హరిపురాలో జరుగనున్న కాంగ్రెసుతనతాటస్థ్యవిధానాన్ని మార్చుకొని కాంగ్రెసు అనుబంధ సంఘములు సంస్థానాలలో పెట్టుకొనడానికి అనుమతియివ్వవలెనని కోరిరి.

హరిపురలో సుభాష్‌చంద్రబోసుఅధ్యక్షతను వెంటనే- ఆనెలలోనే 18 - 21లలో జరిగిన కాంగ్రెసులో 'సంస్థానములలో బాధ్యతాయుత ప్రభుత్వమేర్పరుపబడి ప్రాథమికహక్కులు సిద్ధించుటకై పనిచేయుటకు కాంగ్రెసుకు హక్కుకలదు. కాని సాధించుస్థితిలో ప్రస్తుతంలేదు. ప్రజాఉద్యమములు తలలెత్తవలెననియే కాంగ్రెసు వాంఛ. స్వాతంత్ర్య సమరమును నడుపుభారమంతయు సంస్థానప్రజలదే! సంస్థానప్రజల అంతర పోరాటము కాంగ్రెసుపేరున జరుగగూడదు. స్వతంత్ర సంస్థలు నిర్వహింపవలెను. తాముసానుభూతి యిచ్చుచున్నా

మని కాంగ్రెసుమహాసభ సంస్థానప్రజలకు హామీ యిచ్చుచున్నది 'అనితీర్మానించెను. తాము దూరముగ నుందు మనిరి. కాంగ్రెసు పేరును గూడ వాడ వీలు లేదనిరి. కరాచీలో సంస్థాన ప్రజామహాసభ ఇండియాలో తామంతర్భాగమనిన కలుపుగోలు తనమును త్రోసివేసి వీరు ప్రత్యేక భాగమని కేటాయించిరి. ఇందుపైసంస్థానప్రజలు తమశక్తిసామర్థ్యములను తమ నిగ్రహ ఔదార్యములను చూపదలంచిరి. తమ అఖండత్యాగముతో పట్టుదలతో సంస్థానీశులను బ్రిటిషుప్రభుత్వమును ఊపజూచిరి. కాంగ్రెస్‌కు తమ నిగ్రహశక్తియెడ విశ్వాసము కలుగునట్లు ఋజువుచేయదలంచిరి. అంతటితో సంస్థానప్రజలలో సుజ్వలిత చైతన్యము ఉత్పన్నమాయెను. తదేకదీక్షతో ఒక్క సంవత్సరములో అగ్నిపర్వతము బ్రద్దలైనట్లు అణిగిమణిగియున్న ప్రజలలోని స్వాతంత్ర్యాగ్ని ఒక్కొక్కసంస్థానములో ఒక్కొక్కవిధంగా ప్రజాఉద్యమములు విజృంభింపసాగెను. ఆర్పినను ఆరిపోవని జ్వాలలతో, అణచినను అణగిపోవని వీరోత్సాహముతో ప్రజాశక్తి - నివురుగప్పియున్న ఆకలిమంటలు - సంస్థాన ప్రజలఆర్తనాదములు సంఘశక్తితో సామ్రాజ్యాధీశుల నెదిరింప సాగెను. మచ్చుకొక కొన్ని సంస్థానముల ప్రజా ఉద్యమములు పరికింపదగును.

# సూచి

సంస్థానాలు

| | | | |
|---|---|---|---|
| నీలగిరి | ౧౦౨ | రాజకోట | ౨౫ |
| పాటియాలా | ౫౧ | రాజపిప్పల | ౩౪ |
| పాలిటానా | ౪౬ | రాన్ పూర్ | ౧౫ |
| బంగనపల్లి | ౧౨ | రామదుర్గం | ౧౯ |
| బరోడా | ౨౪ | రాయఘురా | ౧౦౫ |
| బికనీరు | ౭౫ | లింబ్డీ | ౩౫ |
| బూందీ | ౭౪ | లోహార్ | ౫౩ |
| భావనగర్ | ౩౩ | శిర్ మూర్ | ౪౯ |
| భోపాల్ | ౭౦ | సాంగ్లీ | ౨౦ |
| మనావ్రా | ౩౦ | సాందూరు | ౧౩ |
| మీరాజ్ | ౨౨ | సికార్ | ౯౦ |
| మోర్వీ | ౨౯ | సీతామావ్ | ౭౧ |
| మైసూరు | ౬ | సోహవాల్ | ౯౫ |
| రాంపూర్ | ౯౩ | హిందోల్ | ౧౪ |

హైదరాబాద్ ౧

# సంస్థానాలు

## హైదరాబాదు

వైశాల్యము 82,698 చదరపు మైళ్ళు. జనసంఖ్య 14436148; ఆదాయము రు 8,50,00,000 కప్పము లేదు. ఫెడరల్ ఎసెంబ్లీలో 16, కౌన్సిల్‌లో 5 స్థానాలు.

అన్ని సంస్థానాలలో ఆర్థికంగా మంచి ఆదాయం కలది, ఖనిజసంపత్తిలో అనేకావకాశాలు వున్నది, వైశాల్యంలో ఎక్కువకలిగినది, భారతదేశానికి గర్భంగా నట్టనడుమ నున్నది, రాజకీయంగా ఎన్నియో శతాబ్దాల వెనుకబడియున్నది ఈ హైదరాబాదు సంస్థానము. ఇక్కడ ఏమాత్రము రాజకీయచైతన్యం కలిగినాదానికి ప్రభుత్వం మత విద్వేషాలు అంటగట్టి గడియలో రాజకీయ స్వరూపాన్ని నాశనం జేస్తున్నారు. ఇక్కడి సంస్థానాధిపతి మహమ్మదీయ ప్రభువు. ప్రజాబాహుళ్యం నూటికి 85 మంది హిందువులు. ఉద్యోగాలలోగాని, గౌరవ మర్యాదలలోగాని, మహమ్మదీయులును, భాషలో ఉర్దూ భాషయును ప్రత్యేకాభిమానంతో మాత్రమే కాకుండా ఇతరసంఘాలు, లిపులు అణగద్రొక్కుట కూడా ఉద్దేశమాయన్నట్లు వ్యవహరింప బడుతున్నది. దానికి ఎదురెత్తుగ ఉద్యమం వచ్చిన అది మతోద్రేకమవడం సంస్థానాధిపతికి సహజమై పోయింది. ఏనాడు ప్రభుత్వం మతవిషయంలో శ్రద్ధాభి

మానములుగాని, దురభిమానములుగాని చూప కుండా వుంటుందో, ప్రభుత్వం ప్రభుత్వంకోసరమే చేస్తుందో అప్పుడుతప్ప న్యాయం జరుగుటకవకాశం వుండనేరదు.

ఈసంస్థానంలో రాజకీయంగా ప్రజల కెట్టి హక్కులులేవు. సభలుచేసికో వీలులేదు. అనుమతి పొందిన సభలలోనైనా అనుమతిపొందిన ఉపన్యాసాలే యివ్వవలెను. ప్రభుత్వం విద్యాభివృద్ధికి ప్రోత్సాహమివ్వదు. ఎవరన్నా స్వంతపాఠశాలలు పెట్టుకోడానికి అవకాశం తీసివేశారు. లైసెన్సు కావాలె. అది లభింపదు. గ్రంథాలయాలు పెట్టితే అనేక అభ్యంతరాలు. గోడాలు రెండు కుటుంబాలైనాకలసి పెట్టుకోరాదు. ప్రజాభిప్రాయమును నిర్భయంగా చెప్పడానికి ఎవరికీ అధికారంలేదు. 53 గస్తీనిశానీ అని నిర్బంధం ప్రవేశపెట్టారు. సరియగు పత్రికలే లేవు, రానీయరు. మతసంబంధమైన ఊరేగింపులకు స్వాతంత్రంలేదు. 144 లక్షల జనాభాగల దేశంలో విద్యాశాఖకు ఖర్చుచేశామనే 10 లక్షల ధనము, న్నా, 15 లక్షలమంది మాట్లాడే ఉర్దూభాషాభివృద్ధికి వినియోగింప బడుచున్నది. ఇచ్చట

| | |
|---|---|
| 69,72,534 | తెలుగు |
| 37,86,834 | మరాఠీ |
| 16,20,094 | కర్నాటకం |
| 15,07,274 | ఉర్దూ |

మాట్లాడువారున్నారు. ప్రాథమిక విద్యకన్న కళాశాలావిద్యకు ముబ్బడి ఖర్చుచేస్తున్నారు.

ప్రజలు వోటుహక్కు నెరుగరు. అసలు వోటంటేనే తెలియదనవచ్చు. ఇంతవరకెన్నడు ఎన్నికలు జరుగనేలేదు. ప్రజలకు పరిపాలనలో అవకాశం యిచ్చామని ప్రపంచానికి చూపడానికి 1894 సం. లో సంస్థానకౌన్సిలు 15 మంది సభ్యులతో సృష్టించారు. అంతా నియామక సభ్యులే. 1905 లో సభ్యులసంఖ్య 15 నుండి 21 చేశారు. ఇదే అమలులోఉన్నది. అంతా నియామక సభ్యులే. వీరికిగల అధికారాలేమో తెలియవులంటే లేవన్నమాట. రాజ్యాంగ సంస్కరణల విచారణ కొకఉప సంఘం వేశారు, రిపోర్టు త్వరలో వస్తుంది. మింటో మోర్లే సంస్కరణలే యిందు సూచించారనినదంతి.

ఈసంస్థానాధిపతి స్వంతఖర్చులక్రింద 50 లక్షలు తీసికుంటాడు. ఇదిగాక షెరీప్- ఇ- ఖాస్ ఇల్లాఅంటే స్వంతజాగీరు అన్నమాట- 8110 చదరపుమైళ్ళ వైశాల్యంగలది ఉంచుకున్నారు. దీనివల్ల 2 కోట్ల రూపాయిాల ఆదాయము వస్తుంది. స్వంతఆస్తి వేరేఉన్నదిఅంటే సాధారణంగా జమీాందారులు సంస్థానాధిపతులు చెప్పేవిధంగా జమీాలేక సంస్థానం వారిస్వంతంకాదన్నమాట దాని అంతట అదే తేలిపోతున్నది. వాదనకన్నా యిది

ముఖ్యాశంమే ! నామకః తహసీలు కమిటీలు అని కొన్నివున్నవి. కాని ఇంతవరకు ఎన్నడు ఎన్నికలు జరుగనేలేదంటే అక్కడి సంస్థానాలు ప్రజలకెంత ఉపయోగమో తెలుస్తుంది శ్రీవైద్యాగారను సుప్రసిద్ధ జాతీయవాది ఒక రాజ్యాంగం వ్రాశారు. వీరురాజ్యాంగ సంస్కరణ సమంలో సభ్యుడును

ఇచటి పరిపాలనగురించి మనలో సామెతె వున్నదిగా-"నైజాందర్బార్" అని. ప్రజలలో చదువు కున్నవారిలో, నిరుద్యోగులలో కొంత అలజడి బయలుదేరింది. అది జాతీయపంథాపట్టింది. అది రాజకీయ చైతన్యంగా మారింది. హైదరాబాదు స్టేటుకాంగ్రెస్ కార్యవర్గ ఎన్నికలు జరుపుటకు కాంగ్రెస్ మహాసభ 1938 సెప్టెంబరు 9 వ తేదీ సమావేశం కానుండగా, 8 వ తేదీననే ఈమహా సభను, ఈస్టేటు కాంగ్రెస్‌ను నిషేధిస్తూ ఫర్మాన్ ప్రకటించారు. అంతటితో ప్రజలలో తీవ్రాందోళన బయలుదేరింది. సంస్థానంలోని నలుముఖాలనుండి సత్యాగ్రహం సాగింది. నవనవలాడు యువకులు ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలు, అనుభవపరులగు పెద్దలు అంతా రణరంగంలో దూకారు. కాంగ్రెస్ పేరిట జెయిలుకు వెళ్ళారు. వాలంటీరులను పెట్ట రాని హింసలు పెట్టసాగినారు. శ్రీ రామిరెడ్డి అనే వానిని క్షమాపణ యివ్వవలెని బాగా నిర్బంధించా

రు రంధ్రాలలో కారం కుక్కారు. బయటికివచ్చి జరిగిన అత్యాచారాలు చాటాడు. జరిగినవానిలో ఇది మచ్చుఅన్నమాట. రాజకీయ చైతన్యానికి ముఖ్య సాధనలగు పత్రికాప్రచారం లేకుండా సభా స్వాతంత్ర్యం లేకుండా, సుహృత్తరమగు ప్రజాభిప్రాయంలేకుండా దానికై అది ఉబికినట్లుపొంగి స్వాతంత్ర్యసమరానికి హైదరాబాదు మూడు నెలల్లో 500 మంది యోధులను జెయిళ్ళకుపంపినదంటే అత్యాశ్చర్య పడవలెను. ఉల్లాసముతో తలలూపవలెను. బయటినుండి వచ్చినవారిని రాకపోకలు నియమితపరిచారు. హోటళ్ళల్లో తిన్నవారి లెక్కలుంచాలెనన్నారు. బయటివారికి శిక్షలన్నారు. అనుమానస్థులను అరెస్టుచేశారు. పత్రికలను అరికట్టారు. కళాశాలలలో విద్యార్థులు వందేమాతరం పాడకూడదన్నారు. అందుపై 600 మంది విద్యార్థులు పాఠశాలలవిడచి పరాయి విశ్వవిద్యాలయములో చదవవలసి వచ్చెను. ఆర్యసమాజం, హిందూ పౌర స్వాతంత్ర్యసంఘం అంటూ మత వర్ణము యిచ్చుచు కొందరు ప్రచారాన్ని సాగించారు. అది రాజకీయ పోరాటానికి కొంతదెబ్బ కొట్టినదైనది. అందుపై గాంధిగారు ప్రస్తుతం సత్యాగ్రహం నిలుపుచేయుడన్నారు. సత్యాగ్రహం నిలుపుచేస్తూ ప్రకటనచేసిన వైద్యాగారికి 18

నెలల శిక్ష వేశారు. ఉద్యమం అగిపోయింది. ప్రభుత్వం తీవ్రదృష్టినిగుడ్చి ఇంకా కొన్ని నిర్బంధాలు ప్రకటించారు. ఇదివరకు సంస్థానంలోనికి రాకూడదని పత్రికల జాబితా ప్రకటించు చుండెడివారు. ఇపుడువచ్చే పత్రికలజాబితా వేస్తారట. అంటే అనుమతి లేని పత్రిక అడుగుపెట్టడానికి వీలులేదన్న మాట. ఈమధ్య ఉద్యమం ఆపుచేయడం ఘోర అపచారమే. ఆస్వాతంత్ర కాంక్షులు, ఆవత్తిడి సహించలేనివారు రాచబాటన - రాజకీయ పోరాటంలో కాకుండా, మతవర్గాలక్రింద ప్రభుత్వాన్ని ఎదుర్కొంటున్నారు. త్వరలో ఉద్యమం ప్రారంభింపక తప్పదు. ఈపర్యాయం ప్రాథమిక హక్కులు లేక, రాజకీయ స్వాతంత్ర్యంలేక ఆర్థికావకాశములు లేక అలమటించే రైతులు, కూలీలు, యువకులు, వేలకువేలు సమరాగ్నిలో దూకి బాధ్యతాయుత పరిపాలనను బడయవలెను.

## మైసూరు

వైశాల్యము 29, 485 చ. మై. జనాభా 65, 57, 302
ఆదాయము రు 3,95 లక్షలు. సాల్యూట్సు 21.
కప్పం. రు 24,50,000. ఫె. ఎ 7, ఫె. కౌ. 3 స్థానాలు

270 మందిగల ఎసెంబ్లీ, 50 మందిగల కౌన్సిలు అని రెండుశాసనసభ లున్నవి. ఇచట ఎన్నిక

విధానం అమలు జరుగుచున్నది. జిల్లాలలో జిల్లా బోర్డులు ఉన్నవి. అధికారాలు చాలాతక్కువే. శాసనసభలకు దివానేఅధ్యక్షుడు. ప్రజలలో కొంత వికాసంవుంది. 1938 లో స్టేటుకాంగ్రెస్ నిర్మాణ మయింది. త్రివర్ణ జాతీయపతాకం ఎగురవేయ ప్రారంభించారు. అందుపై సంస్థానాధిపతులు దానికి సహించలేక జాతీయపతాకం పెట్టవీలులేదంటూ నిషేధించారు. జాతీయపతాకమును నిలిపి తమజాతీయ గౌరవం నిలుపుటకు 1500 మంది జెయిళ్లకు వెళ్ళారు. విదురాశ్వత్థంలో జాతర (తిరుణాళ్ళ) జరుగు చుండెను. అచటికి వివిధప్రదేశాలనుండి ప్రజలు వేలకువేలు విచ్చేసిరి. ఈ అవకాశం పురస్కరించుకొని బహిరంగసభ యొకటి జరుపదలంచిరి. ఒక గొప్ప సభజేసిరి. ఇంతలో పోలీసు అనవసరంగా జోక్యంకలుగజేసికొని భరింపరాని లాఠీదెబ్బలు, తుపాకులకాల్పులు సాగించిరి. వీనిఫలితంగా 30 మంది చచ్చిరి. అనేకమందికి గాయములు తగిలెను. అందుపై నొకవిచారణ కమిటీనివేసిరి దాదాపు 50 వేల రూపాయలువెచ్చించిరి. వారు జోక్యంకలిగించుకొనడం అనవసరమేగాని మితిమీరిమాత్రం కొట్టలేదన్నారు. పటేలుగారు జోక్యంకలిగించు కొనిరి. సంస్థాన పతాకం, జాతీయపతాకం రెండూ సమానంగా ఎగురవేసేపద్ధతిపై రాజీపడిరి. సంస్కరణల

కొక సంఘం వేసిరి. అందు స్టేటుకాంగ్రెస్ ప్రతినిధి కూడా ఉన్నాడు. ఇంకారిపోర్టు ప్రకటనకాలేదు. అందేమీ ఉండదు. కాని ప్రజలు బాధ్యతాయుత పరిపాలన ఒసంగనిచో తీవ్రోద్యమం సాగించ కృత నిశ్చయులై ఈనివేదికకోసరం ఎదురుచూస్తూ న్నారు. ఇవాళ్లో రేపో పోరుతప్పదు.

## తిరువాన్కూరు

వైశాల్యము 7626. చ. మై. జనాభా 50,95,973.
ఆదా రు 2,32,92 వేలు. సాల్యూట్సు 19. ఫెఏ. 5.
ఫె. కా. 3. కప్పం రు 7,56,430.

దేశంలో మొట్టమొదట పెద్దఎత్తుగా హరిజన దేవాలయ ప్రవేశమిచ్చారు. ప్రజలు ఈనడుమ జరిగిన ఎన్నికల్లో పాల్గొన్నారు. ఇట అసెంబ్లీ కౌన్సిల్ లుకలవు. ఎసెంబ్లీని శ్రీమూలం అసెంబ్లీ అంటారు. దీని సభ్యులు 260 లో 47 గురు ఎన్నుకోబడుదురు. ఈ కౌన్సిలును శ్రీ చిత్రస్టేటు కౌన్సిలుఅంటారు. దీనిలో 37 సభ్యులు. అందు 14 గురు ఎన్నుకోబడుదురు. క్రిందటి సంవత్సరం ఈఎన్ని కలు జరిగినవి. స్టేటుకాంగ్రెస్ దే విజయము. ప్రజల బలం తగ్గించాలెనని పుట్టింది సంస్థాన అధికారు లకు. బ్యాంకి వ్యవహారంలో జోక్యం కలిగించు కున్నారు. ప్రతివిషయంలో జోక్యం నిలిగించుకో

ప్రారంభించారు. అందుపై దివాను ప్రభుత్వం బాగాలేదంటూ మిమోరాండం స్టేటుకాంగ్రెస్ యిచ్చింది. స్టేటుకాంగ్రెస్‌ను నిషేధించారు. అన్ని వైపులనుండి వాలంటీర్లువచ్చి సత్యాగ్రహం ప్రారంభించారు. అరెస్టుచేశారు. క్విలన్, అలప్పేలు గొప్ప పారిశ్రామిక కేంద్రాలు. అచటి 40 వేల కూలీలు నెలకు రు 30 జీతం, వారానికి 48 గంటలుపని కోరారు. స్టేటుకాంగ్రెస్ ఆశయాల కంగీకరించారు. మాకోర్కెలు తీర్చకపోతే సమ్మె చేస్తామన్నారు. ప్రదర్శనాలు చేశారు. ఎవరోతుంటరి అలెప్పేలో కొబ్బరితాడు ఫ్యాక్టరీకి నిప్పంటించాడు. ఇది కూలివాండ్రపనే అని ప్రభుత్వం వీరిమీదికి పోలీసులను పంపారు. తుపాకులు కాల్చారు. అప్పటికల్లా 12 మంది స్టేటుకాంగ్రెస్ అధ్యక్షులు అరెస్టయినారు. ఫ్యాక్టరీ సంగతిపోయి తిరువాన్కూరు సమస్య అయింది. తీవ్రరాజకీయజ్వాల బయలుదేరింది. అరెస్టులు, లాఠీచార్జీలు, తుపాకులు స్వేచ్ఛావిహారం చేసినవి. కార్మికులుకూడా కలిసినందున ప్రభుత్వం జాకింది. గాంధిగారు దివాన్‌పై నిందలు మెమోరాండంలో తీసివేయమన్నారు. దివాన్ పటేలుగార్లు సంభాషించారు. జన్మదినంఅంటూ జెయిళ్ళలో వున్నవారిని ప్రభుత్వం విడుదల చేసింది. మరల కొన్నాళ్ళకు స్టేటుకాంగ్రెస్ సమావేశం జరుపవలె

నని ఆలోచిస్తే మళ్ళా అరెస్టులు సాగించారు. తర్వాత జెయిలులో సమావేశమై గాంధి సలహా ననుసరించి వ్యక్తిపై గల నిందలను ఉపసంహరించు కున్నారు. సంస్కరణలు ఇంకా ఎక్కువగా యివ్వ వలెనని కోరారు. బాధ్యతాయుత పరిపాలన, ప్రాథ మిక హక్కులు, పత్రికాస్వాతంత్ర్యము, మైనరు వెళ్ళినవారికి వోటు, పౌర సత్వహక్కులసంఘము, నిరుద్యోగనివారణ, పన్నుల విధానపు మార్పుదల, వ్యయకర్తనము, గ్రామపరిశ్రమాభివృద్ధి, వ్యవసా య పారిశ్రామిక కూలీలకుసమావేశ,సమ్మెస్వాతం త్రము, ఆర్థికాభివృద్ధి, ఉద్యోగాలలో అందరకు సమానావకాశాలు కావాలెనంటూ ఈ స్టేటు కాం గ్రెస్‌వారు కోరారు. ప్రజలలో ఇప్పుడు మంచి చైతన్యం కలిగింది. కొందరిని జైళ్ళనుండివదిలారు ఇంకా కొందరున్నారు. తీవ్రంగా ప్రచారంచేస్తు న్నారు. అనుక్షణం పోరాటం రాగలదనియే ప్రజలు ప్రభుత్వం ఎదురుచూస్తూయున్నది. ఈ అత్యాచా రాలు, ఈకాల్పులు, ఈ అరెస్టులువల్ల ప్రజాందోళన బాగా బలపడింది. ప్రభుత్వం ఇంకా నిర్బంధ శాసనాలు చేసింది. యువజనసంఘం ప్రాత మెమో రాండంను ప్రభుత్వానికి పంపింది. వారిని అరెస్టు చేస్తున్నారు పోరాటం సాగిపోతూ వున్నది. అరె స్టులు, శిక్షలు నిర్బంధాలు సాగిపోతునే వున్నవి.

క్రైస్తవులను బాధిస్తున్నారని, మతద్వేషంతో నిర్బంధవిధానాలు సాగిస్తున్నారని మహాత్మాగాంధీ గారంటే, అందుకు జవాబుగా గాంధీగారి పలుకుబడి వలనకాక తమనిర్బంధాలకు జంకి తనపైనిందలను స్టేటుకాంగ్రెస్ ఉపసంహరించుకున్నదని గాంధీగారిని కూడా దివాను త్రోసివేస్తున్నాడు. బాధ్యతాయుత పరిపాలన ప్రవేశపెట్టకపోతే తీవ్రాందోళన సాగిస్తామంటూ కాంగ్రెస్ ప్రకటించింది. జెయిళ్ళకు వెళ్ళినందుకు 17 మంది శాసనసభ్యులు సభ్యత్వమునకు అనర్హులని ప్రభుత్వం అన్నది.

## కొచ్చిన్

**వైశాల్యం 1417 చ. మైళ్ళు. జనాభా 12,05,016 ఆదా రు 82,82,000. ఫెడరల్ ఎసెంబ్లీలో 1/3 కౌన్సిలులో 1/3న్నూ స్థానాలు కలవు. సాల్యూటు 17. కప్పం. రు 2 లక్షలు.**

కొచ్చిన్ ఆదర్శప్రాయం, స్వర్గతుల్యం అంటూ రాజకీయ సంస్కరణ లిచ్చారు. కార్యనిర్వహణమంతా సంస్థానాధీశునిదే లేక అతనిచే నియమితమైన మంత్రిది. శాసనసభకు జవాబుదారీ వహించునంత వరకు ఆమంత్రి తొలగింపబడడన్నారు? వ్యవసాయం ఆయుర్వేదం, పంచాయితీలు, ఆరోగ్యం, గృహపరిశ్రమలు, పరపతిసంఘాలు, హరిజనోద్ధరణ ఈ ప్రజాయత్త శాఖలు ప్రజలచే ఎన్నుకోబడిన మంత్రి ఆధీనం,

38 మంది ఎన్నుకోబడువారు. 20 నియమితులు మొత్తం 58 మంది సభ్యులుగల యొకశాసనసభ నిర్మింపబడెను. ఈసభ పరిమితి 3 సంవత్సరములు. దివానే అధ్యక్షుడు. ఈసభను మహారాజెప్పుడైనా రద్దుచేయవచ్చును. రాజకుటుంబ వ్యవహారాలు, దేవస్థాన విషయాలు, మిలిటరీ, హైకోర్టు, నాణెములు ఈసభ చర్చింపరాదు. 82 లక్షల ఆదాయంలో 30 లక్షలు విషయం మాత్రమే చర్చచేయుటకు శాసనసభకు అధికారంవున్నది. ఏశాసనం చేయుడానికి గాని, ఆర్డరేదన్నా జారీచేయడానికి, రాజుగారిదే అంత్యాధికారము. సంస్థానాధీశులు తమ ప్రజలకు బాధ్యతాయుత పరిపాలన యిచ్చుటలో బ్రిటీషు ప్రభుత్వంవారి అడ్డంకేమీ లేదంటూ ఈ దివాను ప్రగల్భాలు చాటాడు. ప్రజాప్రతినిధి మంత్రికిచ్చిన శాఖలు, ఓటుచేయరాని శాఖలుచూస్తే అసలు విషయం బోధపడగలదు.

## బంగనపల్లి

వైశాల్యము 275 చ. మై. జనాభా 39,289 ఆదాయ 8,40,000. కప్పం లేదు. సాల్యూట్సు 9. ఫి. ఎ 1/8 ఫె కా. 1/2.

ఇచట రైతులు పన్నుల భారం, కరువుకాటకములు, తమకష్టాలు సంస్థానాధిపతికి చెప్పుకున్నారు. ప్రజలం

దరు తమకు శిస్తులు తగ్గించవలెనని కోరిరి. ఈ సంస్థానం పరిపాలనలో వీరికి బ్రిటీషు ప్రభుత్వంవారికి భేదాభిప్రాయం వచ్చింది. అందువలన ప్రజలు సంస్థానాధిపతికి చెప్పుకోవాలెనో, లేక బ్రిటీషు ఏజంటుకు చెప్పుకోవాలెనో బోధపడడంలేదు. ప్రజలు తమకున్న కష్టాలనన్నింటిని కలిపి బ్రిటీషు ప్రభుత్వానికి విజ్ఞాపనం పంపుకున్నారని, అందుపై సంస్థానాధిపతిని తొలగించి అడ్మినిస్ట్రేటివ్ కౌన్సిలుద్వారా నడపాలెనని ఆలోచిస్తున్నట్లు తెలుస్తుంది. ప్రజల కష్టాలు, పన్నులు వసూలుచేసే విధానంవల్ల అనుభవిస్తున్న బాధలు చెప్పతరంగాకుండా వున్నవి. త్వరలో ఆందోళన ప్రారంభం కావచ్చును.

## సాండూరు

వై. 167 చ. మై. జనాభా 13,583. ఆదాయం రు 1,69,000 ఫె. ఎ. 1/3 ఫె. కా. 1/6. సాల్యూట్సు 9.

ఇచ్చట రైతులు పన్నులభారంతోను, అధికారుల పత్తిడితోను నిలువలేకుండా వున్నారు. రైతులు పన్నులు తగ్గించవలెనని ఆందోళన వారికి కలిగిన కష్టాలవల్ల ప్రారంభమైంది. కాని అదినిర్మాణ పంథా తొక్కలేదు. అందుపై కొందరను అరెస్టుచేశారు. బయటివారినిరావద్దనిరి. బయటివారెవరూ వెళ్లకుండానే పన్నుల ఉద్యమంగా బయలుదేరింది. చివ

రకు పరిస్థితులను బట్టి ప్రభుత్వం ఆలోచనలోకిదిగి సిస్తులుతగ్గించవలెనని అంటున్న ప్రజల వాంఛను అంగీకరించి వారు కోరినంతవరకు కాదుకాని కొంత సిస్తు తగ్గించిరి. వారుకోరిన సౌకర్యాలు అవగతేము చేసికొనిరి. 1931 ఏప్రిల్ 1 వ తేదీన ఒకకౌన్సిలు అనే శాసనసభను యేర్పాటు చేశారు. ఇందు 25 మందికలరు. అందు 21 అధికారేతరులు అంతా నియోజకులే! అధికారేతర ఉపాధ్యక్షుడు ఉండును. సహకారసంఘాలు కొన్ని పెట్టిరి. అవి ఇవి చేసినట్లు ప్రజలలో అనుకూలతఉన్నట్లు ప్రకటించుచున్నారు. ప్రజలలో రాజకీయచైతన్యా యిపుడిపుడే కలుగుచున్నది. నిర్మాణసంఘాతో బాధ్యతాయుత పరిపాలనకై యొకయుద్యమం త్వరలో వచ్చుసూచనలు కాన్పించుచున్నవి. బాధ్యతాయుత పరిపాలన కావాలెనంటు లోలోపల ఆందోళన జరుగుచున్నది. నిర్మాణయుక్తంగా జరిగితేనేగాని జయప్రదం కాజాలదు.

## ఔంథ్

వై. 501 చ మై. జనాభా 76,507 ఆదా 3,42 వేలు కప్పంలేదు. ఫె. ఎ. 1/5 ఫె. కా. 1/5 స్థానంకలదు.

ఇది యొక సామాన్య మహారాష్ట్ర సంస్థానము. సంస్థానం చిన్నదైనా ఈ సంస్థానాధిపతియొక్క

విశాలాశయము ప్రశంసింపదగినది. ఈ సంస్థానాధిపతి పుత్రుడు అప్పాసాహేబు (జననం 1912) దేశంలో జరిగే సంగతి సందర్భాలు గ్రహించాడు. తన సంస్థానంలో సంస్కరణలు తనకైతానే ప్రవేశపెట్ట దలచినాడు. మహాత్మాగాంధితో సంప్రదించాడు ఇద్దరుకలిసి రాజ్యాంగప్రణాళిక వ్రాశారు. మితవాదంగావున్నా ముందంజవేశాడు. ఈ ప్రణాళిక ప్రకారం వీరి సంస్థానంలో చదువువచ్చినవారి కందరికి వోటుండును. వారిచే పంచాయతీలకు సభ్యులెన్నుకో బడుదురు. ప్రతిపంచాయితీకీ వారిచే ఎన్నుకోబడ్డ అధ్యక్షుడుండును. ఆతాలూకాలోని గ్రామ పంచాయితీ అధ్యక్షులు ఒకతాలూకాసంఘ మగుదురు. ప్రజోపయోగమునకై తాలూకాలోని ఆదాయంలో సగము వీరి కివ్వబడును. ఇట్టి తాలూకా సంఘములు సంస్థానంలో 5 ఉండును. ఆతాలూకా సంఘ అధ్యక్షుణ్ణి, మరియిద్దరి సభ్యులను సంస్థాన ఎసెంబ్లీకి పంపుదురు. ఎసెంబ్లీసభ్యులు 15 మంది. ఎసెంబ్లీసభ్యులు ఖాళీవస్తే పూర్తిచేయబడు చుందురు. ఎసెంబ్లీయే సంస్థానంలో ముఖ్యప్రభుత్వం. సంస్థానాధిపతి ప్రథమపౌరుడుగా ప్రజాభిప్రాయాన్ని సూచిస్తుంటాడు. ఈతడు ఏబిల్లునైనా ఎసెంబ్లీలోకి 3 సార్లు అలోచనకై పంపవచ్చును. తమ బ్రిటీషు గవర్నమెంటు సంబంధమును సరిజేసుకుంటూ

అవసరాన్నిబట్టి ఎసెంబ్లీతో సంప్రదిస్తారు. ఎసెంబ్లీని రద్దుచేయవచ్చును. తిరిగి సమావేశ పరుపవచ్చును. ఎసెంబ్లీసభ్యులనుండి ప్రధానినొకనిని, మరియిద్దరు మంత్రులను, వీ రేర్పాటు చేయావచ్చును. ఈ మంత్రులు ఎసెంబ్లీకి బాధ్యులు. పంచాయితీలకిచ్చిన సగంపోను మిగతధనం సంస్థానానికుండును. ఎసెంబ్లీ బడ్జట్‌వోటుచేయువచ్చును. సంస్థానాధిపతిస్వంతఖర్చు 5 సంవత్సరముల తర్వాతవోటుకు పెట్టబడును. ఈ లోగా అదిరు 36 వేలుండును. ప్రాథమిక విద్య నేర్పు పాఠశాలలు, పెద్దవారిలోగూడా అవిద్యానిర్మూలన ప్రచారం సంవత్సరంలో జరుగవలెను. పంచాయతీలే న్యాయవిచారణ చేయును. అందుకుఫీజులేదు. ఒక హైకోర్టు వుండును. ఒకడిఫెండరు (పబ్లిక్‌ప్రాసిక్యూటరు మాదిరిఅధికారం అన్నమాట) ఉండును. వీరు ప్రభుత్వమునకు సలహాయిచ్చుచుందురు. మొదటి 2 సంవత్సరాలలో అవిశ్వాస తీర్మానం ఉపపాదించరాదు. మొదటి 5 సం॥ లు సంస్థానాధిపతి ఎసెంబ్లీకి 5 గురిని నామినేటు చేయవచ్చును. ఇంకనుకొన్ని రాజకీయ అధికారాలు, కూలీరైతు హక్కులున్ను అందుదహరింపబడెను. 1939 జనవరి 21 వ తేదీ బొంబాయి ప్రధాని బి. జె. ఖేర్. (కాంగ్రెస్) ఈ రాజ్యాంగ ప్రారంభోత్సవమును జరిపెను. పరోక్షపుఎన్నికలు, మరికొన్నికట్టుబాట్లు

బాధ్యతాయుత పరిపాలనలో అసమగ్రతయున్నను తనకైతాను ఈపాటి సంస్కరణ లిచ్చినందులకు, తోడి తెలివిగల సంస్థానాధిపతులకు మార్గదర్శియై నందుకు అభినందించక తీరదు.

## కొల్హాపూర్

వై. 3217 చ. మై. జ నా భా 9,57,137. ఆదా య 67,71 వేలు. సాల్యూట్సు 19. ఫె. ఎ. 1 ఫె.కా. 2 స్థానాలు.

కొల్హాపురం దక్షిణమహారాష్ట్ర సంస్థానాలలో ప్రముఖమైనది ఇచ్చట సంచలనం ప్రారంభమైనదంటే దక్షిణమహారాష్ట్ర సంస్థానాలలో నూతనశకం ప్రారంభమైనదన్నమాటే. ఈ అధిపతి కొన్ని సంవత్సరాలక్రితం స్థానిక సంస్థలు ప్రవేశ పెట్టాడు. ఈ స్థానికసంస్థలకు 7 లక్షలరూపాయీలపై పెత్తనం యిచ్చాననాడు పైకిమాత్రం. ప్రజలు ఈ సంస్థలకు ఇచ్చిన అధికారాలు ప్రయోజనం లేవనియు తమకు బాధ్యతాయుత పరిపాలన యివ్వవలెననియు, ఆందోళన ప్రారంభించారు. స్టేటుకాంగ్రెస్‌ను నిర్మాణంగావించారు. అది పుట్టి పుట్టకముందే ప్రభుత్వము దానిని నిషేధించింది. ప్రజలలో అసంతృప్తి బయలుదేరినది. దానివలన కొంత అన్నాసంతృప్తి పరచకపోలు లేదని ఒకఎత్తుగా

సంస్థానానికి పతికిని, ప్రజలకును అన్యోన్యసహకారముండుట కెట్టివిధానము అవలంబింపవలెనో తెలుపుటకు ప్రధానిని సంస్థానాధిపతి కోరెను. వారి ప్రకటనల ధోరణిచూస్తే మింటోమోర్లే సంస్కరణలకన్న అధిక మాశింపజాలము. అందువలన వారి ప్రకటన ప్రచురమయ్యే వరకు వారి ఆశయం చెప్ప వీలులేదు. ఈలోగా జతలు జతలుగా వాలంటీర్లు సత్యాగ్రహం చేయడం, వారిని అరెస్టులు చేయడం మందగమనంతో సాగుతూన్నది. తీవ్రపరిస్థితులు వచ్చే స్థితిగతులు కాన్పించు చున్నవి.

## రామదుర్గం

వైశాల్యము 169 చ. మైళ్ళు జనాభా 35,401. ఆదాయ 1,82,000? కప్పంలేదు. సాల్యూట్సులేవు. ఫె.ఎ.1/5. ఫె. కౌ. 1/5స్థానాలు.

ఖర్చుస్వంతం 34 వేలు, పోలీసు 17 వేలు, విద్య 98 వేలు. డిపిడబ్ల్యు 41 వేలు దేవాలయాలు 10 వేలు. సరంజాం 5 వేలు, ఆరోగ్యం 5 వేలు. 20 సంత్సరాలలో పన్నులు 70 వేలనుండి $2\frac{1}{2}$ లక్షలకు పెంచారు. ఆదా 182 (?) వేలే అయినాఖర్చు మాత్రం $2\frac{1}{2}$ లక్షలు. ఈపెంపకంవల్ల రైతులు క్రుంగిపోతున్నారు. పన్నులు తగ్గించవలసినదని ఉద్యమం లేవదీశారు. కొన్నివేలమంది ప్రజలు

రాజువద్దకువెళ్ళి పన్నులు తగ్గించవలసినదిగా ప్రాధే యపడ్డారు. అట్లా తగ్గింపడానికి వీలులేదనడమే కాకుండా మిలిటరీతో, పోలీసుతో లాఠీచార్జి చేయించి వెళ్ళకొట్టాడు. గత్యంతరం లేక ప్రజలు సత్యాగ్రహం సాగించారు. 6 నెలనుంచి సత్యా గ్రహం నడుపుతున్నారు. సంస్థానాధిపతి అనుమతి లేనిదే సభలు పెట్టరాదని ఆర్డినెన్సు జారీచేశారు. కొన్ని అరెస్టులు జరిగినవి. నిర్బంధాలు సాగినవి. ఉద్యమం దినదినాభివృద్ధిగాంచడం సంస్థానాధిపతి గ్రహించాడు, శ్రీ దేశపాండ్యాగారుకూడా జోక్యం కలిగించుకొన్నారు, వారితో సంప్రదించి ప్రజలకు త్వరలో ప్రభుత్వం అధికతరముగ అవకాశ మిచ్చుచూ, త్వరలోనొక ప్రకటన జారీచేస్తానంటూ (30-12-38) న ప్రకటించారు. దీనిలో 2 లక్షలు రివిన్యూలో రు 45,000 తగ్గించుట కంగీకరించెను. పదివేల రూపాయలు గ్రామాభివృద్ధికి ప్రతిసాలు ఖర్చుచేయుట కంగీకరించెను. ఈప్రకటన గంగాధర రావు దేశపాండ్య, సాంగ్లే, జాంఖండి. రామదుర్గం. మంత్రులుగల ఉపసంఘం తయారుచేసినది. ప్రభు త్వాదర్శము సంస్థానాధిపతి పాలనకు లోబడి బాధ్యతాయుత ప్రజాపరిపాలనయని నుడివిరి. ప్రజలలో రాజకీయచైతన్యం మాత్రం తీవ్రంగా కలి గింది. ఎట్టిరాజకీయ సంస్కరణములు ఇవ్వబడుతవో

అవి ఎంతవరకు ప్రజావాంఛకు సరిపోవునో చూచి తగు ఆందోళన ప్రారంభించుటకు నిర్ణాయుక్తమగు ఉద్యమం సాగుచున్నది.

## సాంగ్లీ

వైశాల్యం 1136 చ. మైళ్ళు. జనాభా 2,58,442. ఆదా రు 14,25, వేలు. కప్పం రు 1,35 వేలు అధా వచ్చే ప్రాంతాన్ని యిచ్చేశారు. సాల్యూట్సు 9. ఫె.ఏ. ½ ఫె. కా. ½.

ప్రజలు బాధ్యతాయుత పరిపాలనకోసరం ఆందోళన ఉద్దేశించిరి. స్టేటుకాంగ్రెస్ నిర్మించారు. వెంటనే ప్రభుత్వందానిని నిషేధించారు. సత్యాగ్రహం ప్రారంభమైంది కొన్ని అరెస్టులు జరిగినవి. శిక్షలు చెప్పబడెను. వెంటనే త్వరలో రాజకీయ చైతన్యం సంస్థానమంతటా చెలరేగినది. ప్రక్కన ఉన్న ఔంథ్ సంస్థానాధిపతి బాధ్యతాయుత పరిపాలన యివ్వడానికి చేస్తున్న ఆలోచనలు చూశాడు. లాభంలేదని తలంచాడు. కొంతఅన్నా సంతృప్తిపరుపకపోతే వీలులేదని తలచారు. ద్వంద పరిపాలన పద్ధతిని ప్రవేశపెట్టారు. ప్రజలతోకూడు కొన్న ప్రజలచే ఎన్నుకోబడిన సంస్థాన ప్రజాపరిషత్తుకు అధికారములు ఇత్తుననియు, ౧౯౩౮ డిశంబరులో నొక ప్రకటన జారీచేసెను. ఇచటి ద్వంద

పరిపాలనాపద్ధతి మన రాష్ట్రాలలో అమలుజరిగిన దానివలెగాక ప్రజాసమ్మతంగా ఉపయోగ పడుతుందిఅని ప్రజానాయకులు అంటున్నారు. ఆచరణలోనికి వస్తేనేగాని దీని పరిణామం తేలదు. రాజకీయ సంస్కరణములు అమలుజరిపే ఆలోచనలో ప్రజలున్నారు. ఆందోళన జరుగుచున్నది.

## ఖురంద్ వాడ్ (సీనియర్)

**వైశాల్యం 182 చ. మైళ్ళు. జనాభా 44,204 ఆదా రు 4,15,000. కప్పం రు 9,619 ఫె.ఎ. 1/5 ఫె. కా. 1/5.**

సభాస్వాతంత్ర్యం, వాక్స్వాతంత్ర్యం కావాలెనంటూ ప్రజలు ఆందోళన సాగించారు. ప్రభుత్వం వెనువెంటనే సభలు చేసికోరాదంటూ నిషేధాజ్ఞలు జారీచేశారు. మరింత తీవ్రంగా ఆందోళన ప్రారంభమైనది సభలు, ఊరేగింపులు, ప్రజలలో ప్రచారం సాగించారు. రివిన్యూ రిమీషనుకూడా యివ్వవలెనని కోరారు. ప్రజాభిప్రాయాన్ని గుర్తించ కలిగారు. పీనిఫలితంగా 1938 డిసెంబరు 13 వ తేదీ ఈ మహారాణి బాధ్యతాయుత పరిపాలనా సూత్రాన్ని అంగీకరించుచు నొకప్రకటన చేసింది. తిక్కతాలూకాలో భూమిశిస్తు రిమిషనున్నూ, నూటికి 12½ వంతున రాజ్యమంతట

భూమిశిస్తు తగ్గింపున్నూ, స్వదేశీ నూనెమిల్లులపై పన్ను తగ్గింపున్నూ, ప్రజలు నేలనుండి ఉప్పు తీసి కోవడానికి అవకాశమున్నూ యిస్తూ ప్రకటించారు. గ్రామపంచాయితీలు, జిల్లాబోర్డులు, కేంద్రసలహా సంఘం యేర్పాటుచేసే ఆలోచన చేస్తున్నా మన్నారు. ఈ నిషేధం పీనిసంగతి యేమీా ప్రక టించడంలేదు. ఆందోళన ఒకవంక సాగుతునే యున్నది.

## మీరాజ్

వై. 342 చ. మై. జ నా భా 93,957, ఆ దా య ం రు 2,86 వేలు, కప్పం రు 7,389. ఫె. ఎ. 1/5 ఫె. కా. 1/5.

ఇచటి ప్రజలు కష్టములుపడుచు తమ పౌరసత్వము లకు ఆందోళన ప్రారంభించారు. రాజకీయ సంస్కా రణములు కావలెనన్నారు. కొంతఆందోళనసాగింది. త్వరలోనే అధిపతి స్థితిగతులు పరికించాడు. చివ రకు ప్రజాప్రతినిధులు, ప్రభుత్వప్రతినిధులు గల ఒకసంఘాన్ని సంస్కరణము లెట్టివి ఇవ్వడము అనే విషయాన్ని గురించి చర్చించడానికివేశారు. తన కిబ్బందిలేకుండా వుండేవిగాచూచి తదధిపతి ప్రజల కిచ్చుటకు అంగీకరించాడు. స్థానికసంస్థలలో ఎన్నిక సభ్యులను హెచ్చించుట, రైతులీయవలసినపన్నును

నూటికి 25 వంతునతగ్గించుట, రైతులీయవలసిన పాతబకాయీలు ఒకలక్షవరకు వసూలుచేయకుం డుట, హరిజనులకు ప్రభుత్వోద్యోగాలిచ్చుట, బాధ్యతాయుత పరిపాలన త్వరలో ప్రారంభించుట. ఇపు డీఉపసంఘం చర్చించుచున్నందున ప్రజలు ఈసంఘనివేదికకై ఎదురుచూచుచున్నారు. సంతృప్తి కరంగా లేకపోతే సత్యాగ్రహం, తీవ్రాందోళన సాగిస్తారు.

## జాథ్

వైశాల్యము 980 చ. మైళ్ళు. జనాభా 91,102 ఆదా రు 3,59 వేలు. కప్పం రు 11,147. ఫె. ఎ. 1/5 ఫె. కా. 1/5

ఇచటి ప్రజలు ఇపుడిపుడే నిద్రమేల్కొను చున్నారు. జాథ్‌కు 7 మైళ్ళ దూరంలోనున్న బీర కారలో 1938 డిసెంబరు 11 వ తేదీ శ్రీ గంగా ధరరావు దేశపాండ్యాగారి అధ్యక్షతను జాథ్ ప్రజామహాసభ జరిగింది. ప్రజలకు పౌరసత్వ హక్కులు కూర్పవలెననియు, బాధ్యతాయుత పరి పాలననొసంగవలసినదనియు, తదధిపతిని కోరుచు తీర్మానించిరి.

## బరోడా

వైశాల్యము 8164 జనాభా 24,43,007 ఆదాయ 2,41,79 వేలు సాల్యూట్సు 21 . ఆనాడు సిపాయి తిరుగుబాటులో సహాయంచేసేతీశారు. స్త్రీ ఫే. ఎ. 3. ఫే. కా 3

విజ్ఞానం, చదువు, సంఘసంస్కరణలలో ముందడుగు వేసినా రాజకీయంగానూ, ఆర్థికంగానూ, చాలా వెనుకబడియున్నది. ప్రజలు వెనుకబడియున్నారు. ప్రజల కధికారాలు అవకాశాలు యేమీ లేవు. సభాస్వాతంత్ర్యం లేదు. బరోడా ప్రజామండలి ప్రారంభించి చాలాదినాలైనది. రాజకీయ సంస్కరణలు కావాలెనని కోరుచున్నారు. చివరకు అప్పుడప్పుడు ఈప్రజామండలి సభలుకూడా జరుప వీలులేదంటే మరొకరి సరిహద్దులో చేసికొన్నారు. ప్రజల కేపాటి ప్రాతినిధ్యం లేని యొకకమిటీని రాజకీయ సంస్కరణలు ఆలోచించడానికి వేసిరి. లాభంలేదని ప్రజలనిరి. ప్రజలు సభచేసి ప్రజలకు పూర్తిగ బాధ్యతగల రాజ్యాంగము నొసంగవలసినదనియు ఈవిచారణ కమిటీలో సగముమందిని ప్రజామండలి సభ్యులను వేసికోవలసినదనియు, ఈప్రభుత్వ సభ్యులతో కూడిన విచారణకమిటీ పనికిరాదనియు తీవ్రప్రచారం చేయుచున్నారు. తగాదా తీవ్రంగా బయలుదేరు

సూచనలు కాన్పించుచున్నవి. 1939 ఫిబ్రవరి 6 వ తేదీన ప్రాతరాజు సాయాజీగాయిక్వార్ గతించెను. ఈ యువరాజు రాజ్యమెట్లుండునో కనవలెను. ప్రజలలో మాత్రం తీవ్ర రాజకీయ చైతన్యం కలిగింది. త్వరలో మహాదుద్యమము సాగనున్నది.

రాజకోట

చై. 282. జనాభా 75,540. అదాయ 12,92,280.
సాల్యూట్సు 9. కప్పము (?) ఫె.ఎ.1/8 ఫె. కా. 1/4

పన్నులు తగ్గించవలెననిన్నీ, పౌరసత్వపు హక్కులు యివ్వవలెననిన్నీ, ప్రజలు ప్రచారం ప్రారంభించారు. స్టేటుకాంగ్రెస్ నిర్మించారు. వెంటనే దానిని నిషేధించారు. సభలు చేస్తే అరెస్టుచేయ మొదలుపెట్టారు. వందలకొలది జట్లు అరెస్టుకాబడినవి. సభలకు దూరప్రదేశాలనుండికూడా విరివిగా ప్రజలు వచ్చారు. ఊరూరు తిరిగి కాంగ్రెస్ ప్రచారం జరిపారు. ప్రధాని కాడల్ తీవ్రంగా ఎదుర్కో తలచినాడు. వల్లభబాయి పటేలుతో రాజీఅన్నారు. కథను ఎదురుతిప్పారు. అరెస్టులు తీవ్రంచేశారు. 1500 పైగా అరెస్టు అయినారు. రాజకోట ఎసెంబ్లీ సభ్యులూ రాజీనామా నిచ్చారు ఠాకూరు సాహేబు రాజీపడతాననంటే కాడల్ వలదన్నాడు. కాడల్ను

తొలగించి, పటేలును పిలుపించుకొని రాజీపడ్డాడు. జెయిల్లో ఉన్నవారిని విడిచేశారు. రాజ్యాంగ సంస్కరణలు ఆలోచించే 10 మందికమిటీలో ప్రజాపరిషత్తువారి 7 గురుని పటేల్ చెప్పిన ప్రకారంగా వేసుకుంటానికి ఠాకూరుసాహేబు అంగీకరించారు. ఇచట స్థితిగతులు ప్రపంచదృష్టిని ఆకర్షించాయి. బ్రిటిషు గవర్నమెంటు లోలోపల పూర్తి జోక్యం కలిగించుకొని 'నీక్షేమం, నీసంస్థాన క్షేమం చూచుకో'మని ఠాకూరు సాహెబును బెదిరించారు. ఎట్లాగైనా రాజీ భంగం చేయాలెనని ప్రయత్నించారు. ఈ బ్రిటిష్ సామ్రాజ్యపు ఏజంట్లకు ధైర్యము ఎక్కడిది? అంతరంగిక పరిపాలనలో మాకు జోక్యం లేదన్నా ఠాకూరు సాహెబును పదచ్యుతుణ్ణి చేస్తానని బెదరించారు. గత్యంతరంలేక రాజీ భగ్నం చేసుకున్నాడు. పటేల్ గారు ప్రభుత్వజోక్యానికి సంబంధించిన ఉత్తరాలు ప్రకటించారు. ఇపుడు మరల సత్యాగ్రహంప్రారంభమయింది. మాతా కస్తూరిబాయి గాంధీ మొదలైన వీరనారీమణులు అరెస్టుచేయబడ్డారు. ఘోరఘోరంగా తీవ్రంగా జరుగుతున్నది. నిత్యం జతలకుజతలు అరెస్టులు జరుగుచున్నవి. ఇపుడు పోరాటం సంస్థానాధిపతితో కాదనిన్నీ, అతనిని కీలుబొమ్మగా ఆడిస్తున్న బ్రిటిషు గవర్నమెంటుతో ననిన్నీ గాంధీ మహాత్ముడు చాటాడు. ప్రపం

చం ఇచటి సంగ్రామాన్ని ఎదురు చూస్తున్నది. మరల ఇచటి ఉద్యమాన్ని గాంధిగారు ఆపుదల చేశారు. ఠాకూరుసాహెబుతో రాజీమాట్లాడుటకు గాంధీమహాత్ముడు ఫిబ్రవరి 27 న వెళ్ళాడు.

## జునగడ

వై. 3,337, జనాభా 5,45,152, ఆదా రు 79,62000, కప్పం28,397, సాల్యూట్సు 15, ఫె. ఎ. 1 ఫె. కా.1.

ఇచట రాజ్యాంగ సంస్కరణములకై ఆందోళన చేయుటకొక ప్రజామండలి నిర్మాణముగావింపబడెను. అందుపై కొంతప్రచారం ఆందోళన సాగింది ఒకవంక డిసెంబరులో ప్రజలకుకొన్నిహక్కులిస్తానని 1939 జనవరి 6 వ తేదీన ప్రకటించారు. మరొకవంక సదరుప్రజామండలి అక్రమసంఘంగా నిర్ణయించి నిషేధించారు. అందుపైప్రజలు తమ అసమ్మతి తెలుపుటకు జనవరి 13 వ తేదీ బహిష్కారదినంగా హర్తాల్ చేయడానికి యేర్పాటు చేశారు. ప్రజలలో అసంతృప్తి తీవ్రంగా వ్యాపించింది. ఆందోళన సాగుచునేయున్నది. ప్రజలంతా ఏవిధంగా తీవ్రమగు నాందోళన సాగించడమాయని ఆలోచిస్తున్నారు. ప్రచారం జరుగుచున్నది. త్వరలోతీవ్రరూపందాల్చు సూచనలు కాన్పించుచున్నవి.

## మోర్వీ

వై. 822 చ. మైళ్ళు జనాభా 1,18, 028. ఆదా రు 55,49,975. సాల్యూట్సు 11. కప్పం రు 9263. ఇతర సంస్థానాలకు రు 52296. ఫె ఎ ½ ఫె. కా. ½

ఇచటి ప్రజలు అప్పుల బాధలో మునిగి మునక లగుతున్నారు. భూమిశిస్తు ఎకరాకు రు 2. 15. 6 లు ఈ అప్పుల బాధవల్ల ప్రజలలో ఆందోళన ఎక్కువై ప్రభుత్వపు దృష్టిలోనికి తీసికొని రావడము, అందుపై వారు విచారణ జరుపడం జరిగింది సంస్థానంలో 14 లక్షల రూపాయీల అప్పు తేలింది అంటే తలకు రు 14 అన్నమాట. ఆదాయం అసలున్నదా యని అనుమానం? అందుపై ప్రభుత్వం వారొక విధానం ఆలోచించారు. వడ్డీనూటికి 6 వంతున, వడ్డీ అసలున్నూ కలిసి వానిభూమిశిస్తుకు 5 రెట్లు మించ కూడదన్నారు. ఈ అప్పు బ్యాంకి తీరుస్తుంది. బ్యాంకి వడ్డీ పుచ్చుకోను. తలకు రు 24 అప్పు వరకు యివ్వవలె నన్నమాట. కొంత సమంజసమే. ఆర్థికంగా యిట్లావుండగా రాజకీయంగా, కొంత ప్రజలలో అలజడి బయలుదేరింది. త్వరలో రాజ కీయ సంస్కరణలు కోరుతూ ఉద్యమం బయలు దేరు ప్రయత్నాలు సాగుచున్నవి.

## కచ్

వై. 8249. చ. మై. జ నా భా 5,14,307. ఆ దా
రు 27,75,000. కప్పం రు 82,257 సెల్యూట్సు 17
ఫే. ఎ. 1. ఫై.కో. 1.

ఇదిపశ్చిమఇండియాలోని కథియవార్ మతాలోనిది. ప్రజలుతమకు పన్నులభారం తగ్గించవలెనని సభలు చేసికొనే అధికారం వుండవలెనంటూ ప్రారంభించారు. ఈ ప్రజలు తమకు చుట్టుప్రక్క లనున్న నవ నగర్, భావనగర్, రాజకోట్ల సంస్థానాలలో జరుగుచున్న ప్రజాందోళన గ్రహించారు. ఇన్నిదినములనుండి తాము పడుచున్న ఇక్కట్టులు ఈ నాడు బయటికి ఏవిధంగా చెప్పుకోవాలెనో అర్థమయింది ఆయాసంస్థాన ప్రజామండలులతో సంప్రదిస్తున్నారు. కచ్ ప్రజామహాసభ జరిపారు. శ్రీ సర్దార్ పటేల్ గారు అధ్యక్షులు. బాధ్యతాయుతపరిపాలన కావలెననియు, పన్నులు తగ్గించవలెననియు కోరిరి. సంస్థానంవారు సరియగుసమాధాన మివ్వనిచో తీవ్రమగు ప్రజాందోళనము ప్రారంభింప బడనున్నది. అధికారులవత్తిడివల్ల బయటికి పొక్కుటకుకూడా ప్రజలకు ధైర్యంలేకపోయింది. నేడురాష్ట్రాలలోని కాంగ్రెస్ మంత్రివర్గాలు రావడం, ప్రక్కనఉన్న సంస్థానంలో ప్రజాఉద్యమం లేవడంకొంత ఆశాజ్యోతి కన్పించింది. సత్యాగ్రహంజరుగుచున్నది. చుట్టుప్ర

క్కల గ్రామాలనుండి యువకులు సత్యాగ్రహం జరుపడానికి జతలుజతలుగా వస్తూవున్నారు.

## మన్నా

వై. 25. జనాభా 16,942. ఆదా రు 162000 కప్పం లేదు. సభ్యత్వం లేదు.

ఇచట 1927 సం. న సెటిల్‌మెంటు జరుగవలసియున్నది. ధరలు పడిపోయినందున పన్నులు తగ్గించవలసి వస్తుందేమోనని అధిపతి సెటిల్‌మెంటు జరుపలేదు. ప్రజలు ఆందోళన ప్రారంభించారు. పంటలో 5 వ వంతు సిస్తుఅని ప్రజలు అన్నారు. కాకపోతే సత్యాగ్రహం చేస్తామన్నారు. ఏజెంటుకు రైతులు అర్జీ పంపుకున్నారు. 2000 మంది పొలిటికల్ ఏజంటువద్దకు రాయబారం వెళ్ళారు. సంగతులన్నీ కోటలోవుండే గవర్నరు జనరల్ ఏజంటుకు తెలియజేశారు. మన్నావర్తకులు అధికారుల వద్దకు రాయబారం వెళ్ళి నూటికి 16½ మొదలు 18 3/4 వరకు సిస్తు తగ్గించేటట్లు రాజీపడ్డారు, రైతులు భరించలేకున్నారు. అందుచేత అంగీకరించలేదు. నూటికి 50 వంతు తగ్గించవలె నన్నారు. ప్రభుత్వం నిర్బధం ప్రారంభించిది. అవసరమని సంస్థానాధిపతి బలాన్ని బయటినుండి తెప్పించుకొన్నాడు. ప్రజలలో ఉద్యమం బాగా వ్యాప్తమై

ప్రజాఉద్యమమైనది. 1938 జనవరి 11 ఖేదత్ కమి టీని అక్రమసంఘం అంటూ ప్రభుత్వం దాన్ని నిషే ధించింది. ఆస్తి జప్తులు చేశారు. ఆస్తి ఎక్కడ దొరికితే అక్కడల్లా జప్తుచేశారు. పసిపాప యింట్లో వున్నదన్నా ఇంటికి తాళం వేశారు తర్వాత కొన్నాళ్ళకు తెరిచిచూస్తే మృత శిశువున్నది. జప్తులు, వారంట్లు ఆస్తి కాజేయడం అంతులేదు. అక్రమచర్యలకు అంతులేదు. ఆడవారిని హింసిం చారు. ప్రజాఉద్యమం ప్రబలింది. 12 వేల రైతుల సభ జరుగుతుంటే ఆశ్వీక సైనికులచేత త్రొక్కిం చారు. పత్రికాధిపతులనుకూడా బెదిరించారు. చాలా అన్యాయాలు జరిగిపోతున్నాయి. సత్యా గ్రహంసాగిపోతున్నది. ఏమికానున్నదో!

## జోరా

వై. 602 చ. మై. జ నా భా 1,,00,166. ఆ దా రు 12,96,000 లు. కప్పం రు 137,127. ఇంగ్లాండు ప్రభుత్వానికి, రు 500 ఇందూరుకు ఇస్తాడు. సాల్యూ ట్సు 13. ఫె. ఎ. 1/2 ఫె.క్రా. 1/2.

ఇచట ప్రజలు ఆర్థికంగా బాధపడుతున్నారు. ప్రజ లు అలజడిచేశారు. బైటికి కన్పడడానికి, పద్ధతిప్రకా రం చేసినట్లుండడానికి ప్రభుత్వము స్టేటుబ్యాంకి ప్రారంభించారు. కొన్ని రాజకీయ సంస్కరణములు

ప్రకటించారు. ఇచటి పరిశ్రమలకు సహాయంచేయు డానికి, పరిశ్రమలు అభివృద్ధిచేయుడానికి ఈ బ్యాంక్ పెట్టానంటూ సంస్థానాధిపతి ప్రకటన జారీచేశాడు. ప్రభుత్వ ధనమంతా ఈ బ్యాంకిలోనే వుంచుతానని ప్రకటించారు. ఆ రాజకీయ సంస్కరణల స్వరూపం ఈ బ్యాంకి మూలంగా ప్రజలకు చేసే సహాయం ఎట్లాగా వుంటుందో అని ప్రజలు ఎదురుచూస్తు న్నారు. అది తేలిపోతే తమదారి చూచుకొనుటను ఆలోచిస్తున్నారు. తీవ్రఆందోళనకు తయారైనారు.

## ఫోడ్సార్

వై. 16 జనాభా 6708 ఆదా రు 51000 కప్పం రు 3989చాలాచిన్న సంస్థానము.

ఇది పశ్చిమ ఇండియా ఏజన్సీలో నున్నది. ఈ ఠాకూరు సాహేబు ప్రజలపై చూపుచున్న నిర్బంధ చర్యల ఫలితంగా అచట వెయ్యిమంది రైతులు 'హిజారత్'(?) చేయుటకును, సంస్థానంవదలి వెళ్ళు టకును నిశ్చయించిరి. కొన్నిదినముల క్రితము రాజప్రాసాదమునకు వెళ్ళి తమకష్టములను మొర పెట్టుకొనిరి. ఫలితం లాఠీచార్జి జరిగెను. పలువురకు గాయములు తగిలెను. హర్తాలు జరిపిరి. తీవ్ర నిర్బంధచర్యలు ప్రారంభమాయెను. భరించలేక పోయిరి. గత్యంతరంలేక పలువురు రైతులు సంస్థా

నం వదలి పోయిరి, ఇంకా పోవుచున్నారు. విఠలఘడ్ తాలూకాదారువద్దకు రైతులు వెళ్ళి కష్టములను తెలుపుకొనిరి. కష్టములు నివారింపబడే వరకు కదలమనిరి. సత్యాగ్రహం ప్రారంభింపబడెను. సౌమ్యంగా సత్యాగ్రహం సాగిపోవుచున్నది. ఎంతచిన్నసంస్థానమో ఎంతనిర్బంధమో ఈ నిరంకుశత్వం గమనించండి!

## భావనగర్

వై. 2961 చ. మై. జ నా భా 5,00,274, ఆదాయ 1,85,86,729. కప్పం రు 1,28,008, ఇతర సంస్థానాలకు 26,439 రు. సాల్యూట్సు 13. ఫై. ఎ. 1, ఫై. కా. 1.

ఇది కథియవార్ మండలిలోది. ఈ ప్రజలు భరింపరాని పన్నులభారంతోడను, ఎప్పుడు పట్టినాఅధికారులకు, సంస్థానాధిపతులకు ఊడిగంచేయడం, పౌరసత్వహక్కులు లేకుండాను బాధపడుతున్నారు, అధికారులు బెదిరిస్తున్నారు. ప్రజలు కష్టాలు తెలుపుకోడానికి 1938 ఫిబ్రవరి 3 వ తేదీ ఒక మహాసభ ఏర్పాటు చేశారు. బాధ్యతాయుత పరిపాలన నొసంగ వలసినదిగ కోరుటకును, పౌరసత్వహక్కులు యివ్వవలసినదని, భరింపరాని పన్నులు తగ్గింపవలసినదని ప్రభుత్వాన్ని కోరారు. దివ్యమం

త్వరలో విజృంభించుటకు తగు సన్నాహము జరుగు చున్నది.

## రాజపిప్పల

వై. 1517 చ. మై. జ నా భా 206086, ఆ దా రు 24,95,000 కప్పం రు 50,00 బరోడా సంస్థానము నకు చెల్లించుచుకు. సాల్యూట్సు 13. ఫె. ఎ. 1/2 ఫె. కా. 1/2.

గుజరాత్ ఏజన్సీలోనిది. ఈనడుమనే ప్రజావాంఛ ప్రబలంది. దూరానవుండి అందోళసాగించారు. ప్రజలలో చైతన్యం కలిగింది. ప్రతికలుకొన్ని నిషే ధింపబడ్డవి. పన్నులుతగ్గించుట, బాధ్యతాయుత ప్రభు త్వంకావలెనంటున్నారు. ఆదోళనబయలుదేరింది. సర్దార్ పటేల్ అధ్యక్షతను ప్రజాసభ1938డిసెంబరు 28న జరిగింది. బాధ్యతాయుత పరిపాలనకోరుచును, మరికొన్ని తీర్మానాలును చేయబడెను. సమావేశా నంతరంతదధిపతి పటేల్‌నుకలిసికొని సంప్రదించాడు పన్నులుతగ్గించడానికి, చెట్లుఊరికేకొట్టుకొనడానికి, పేదలుప్రభుత్వస్థలాలలో ఇండ్లుకట్టుకోవడానికి పేరుకుకొద్ది రుసుమేవిధించారు. స్థానికసంస్థలు ఎన్ని కలపై నిర్మింపబడడానికి వానిఅధ్యక్షులనుకూడా వారే ఎన్నుకొనడానికి అంగీకరించారు. ప్రెస్‌లపై నిర్బంధాలను ొలగించారు. ఎన్నాళ్ళనుండియో

సమావేశంకాకుండావున్న శాసనసభను త్వరలో సమావేశపరచడానికి ఒప్పుకొన్నాడు. ప్రజలలో బాధ్యతాయుత పరిపాలనావాంఛ ఉజ్వలితమైయున్నది ప్రజావాంఛలు తీరకపోతే తీవ్రఉద్యమం సాగుతుంది.

## లిండి

మై. 343 చ. మైళ్ళు. జనాభా 40,688 ఆదా. రు 9 లక్షలు. కప్పం రు 54517 బ్రిటిషువారికిని, రు 1390 మరొకసంస్థానానికి (?) యిస్తారు సాల్యూట్సు 9. ఫే. ఎ. 1/8 ఫే. కా. 1/4.

ప్రజలు దుర్భరబాధలలో పడిపోయినారు. 1939 జనవరి 1 తేదీ దర్బార్ గోపాల్ దాసుగారు 7 వేలమంది ప్రజలుగల సభలో బాధ్యతాయుత ప్రభుత్వ మొసంగవలెనని కోరిరి. అటులచేయనిచో ప్రజాందోళన చేయవలెననియు సంస్థానం నామరూపాలు లేకుండా పోవుననియు హెచ్చరించిరి. ఇట్లుండగా సంస్థానాల్లో ప్రజాఉద్యమాలు బయలుదేరడానికి భయపడి సంస్థానాధిపతులు అంతా ముఠాలుగాజేరి ఏమిచెయ్యడం అని ఆలోచించి దుండగీండ్రపద్ధతి నవలంబించ దలచారు. చివరకు గూండా పద్ధతిని వరించారు. ప్రజలను నాయకులను, ప్రజామండలులను హింసింప దల

చారు. ఈ సంస్థానంలో 80 మంది దుండగీండ్రు మోటార్లలో తుపాకులతో వెళ్ళి ప్రజలపై పడి వారి ఆస్తులను అపహరించు చున్నారు. ప్రజలను కొట్టుచున్నారు. వీరిలో ప్రభుత్వోద్యోగస్తు లున్నారని గుర్తు పట్టారు. ఈ అక్రమాల నాపవలసినదంటూ అధికారులకు మొరపెట్టుకొన్నారు. లాభం లేకపోయింది. 3000 మంది రైతులు రాజువద్ద ఫిబ్రవరి 6 వ తేదీనుండి సత్యాగ్రహం చేస్తున్నారు. తమకష్టాలు తీర్చేవరకు అక్కడే ప్రాయోపవేశం చేస్తామన్నారు. అందుపై రెండు రోజులకు దర్బార్ గోపాల్ దాసుగారువచ్చిఅందరిని నిరశనవ్రతం మాన్పించారు ఇబ్బందులు వైస్రాయికి, గాంధిగారికి తంతి యిచ్చారు. 19 వ తేదీ ప్రజాపరిషత్తుసభ జరుపడానికి యేర్పాటు చేశారు. అది జరుపుతే మాకేం అభ్యంతరం లేదు గాని ప్రజాపరిషత్తు వ్యతిరేకులున్నారు. వారు గోల చేస్తారని ప్రభుత్వంవారు ప్రకటించారు. సభకు అధ్యక్షత వహించడానికి సర్దార్ గోపాల్ దాసు రైలులో దిగగానే సనాతన సభవారనే పేరుతో తుంటరులు గోలచేసి వారిమీద రాళ్ళు విసరి దెబ్బలు కొట్టడానికి తయారైనారు. వీరు సభకు పోవుటకు వీలులేకపోయింది. లీలావతి మున్షీగారధ్యక్షత వహించారు. 4000 మంది

రైతులు వచ్చారు. తీవ్ర స్వరూపంతో ప్రభుత్వం క్రొత్త శక్తితో ఎదుర్కొ-తలచింది. ఉద్యమం సాగిపోతూవున్నది. ప్రభుత్వం అత్యాచారాలకు దిగింది. కొన్ని ప్రాణాలు ఆహుతిఅయిపోయినవి. ప్రభుత్వం తీవ్రింగా కొందరిని బాధించెను. 3000 మంది ప్రజలు సంస్థానం వదలి పోయినారు. ప్రజలు తమ హక్కులను ఎట్టిత్యాగమునకైనాసరే సిద్ధపడి అహింసా విధానంతో నిలుపుకోదల్చారు.

## నవనగర్

వై. 3791 చ. మైళ్ళు. జనాభా 4,09,192. ఆదా రు 97,18,748. కప్పం ఇంగ్లాండుకు రు 50,312. ఇతర సంస్థానాలకు రు 69,781. ఫై. ఎ. 1. ఫై. కా. 1.

ఇది కథియవారు ముఠాలోనిది. ఈఅధిపతికి ప్రజల కష్టాలు విచారించడానికి మనస్సేలేదనవచ్చును. ఎప్పుడువిందులు, విహారాలు,గౌరవాలు, వీనిక్రింద ఖర్చులు చేస్తుంటారు. వీరు గవర్నరుజనరల్ లు వచ్చినపుడు చేసినవిందులు, అందుకు చేసినఖర్చులు గమనింపదగ్గవిషయం. గతించిన నవనగర్ రాజాసాహెబు ఆయాగవర్నరుజనరలు వచ్చినపుడు వారిరాకకై ఈక్రిందిఖర్చులు చేసెను.

| గవర్నరుజనరల్ పేరు | లక్షలలో |
|---|---|
| సిడెన్ హామ్ ప్రభువు | రూ 7 |
| వెల్లింగ్డను ప్రభుత్వ | 10 |

సంస్థానాలు

| | |
|---|---|
| లాయడ్ ప్రభువు | రూ 5 |
| రీడింగు ప్రభువు | 15 |
| ఇర్విను ప్రభువు | 25 |

ఇర్విను ప్రభువుకు చేసినవిందునకైన(వారువచ్చినప్పుడైన) 25 లక్షుల రూపాయీల ఖర్చుకువివరాలు.

| వివరం | వేలలో |
|---|---|
| క్రొత్తమోటార్లు | రూ 400 |
| మోటారుబోట్లు | 580 |
| నౌకర్ల దుస్తులు | 65 |
| అలంకారములు | 200 |
| పూలదండలు | 15 |
| కర్పూరదండలు | 5 |
| క్రొత్తఎలెక్ట్రిక్ సామానులు | 150 |
| డేరాలు | 50 |
| పెట్రోలు | 25 |
| వేట | 100 |
| విందు | 100 |
| ఫర్నిచర్ | 100 |
| ఫోటోలు | 35 |
| తివాచీలు | 30 |
| బాణసంచా | 20 |
| చెప్పగారాని కార్యములకు | 300 |
| ఇతరములకు | 315 |
| మొత్తం | 25,00 |

ఈవిధంగా ఖర్చుచేస్తున్నారంటే వీ రేవిధంగా వసూలు చేయుచున్నారో పరికింపవలయును. ఇది అంత

యు ప్రజలనుండి వసూలుచేసినదేగా! అదిఏవిధంగా వసూలుచేసిరో ఏఏపన్నులు వేసిరో పరికింపుడు.

## వ్యవసాయదారులు చెల్లింపవలసినపన్నులు

భూమిసిస్తు
అస్తి హక్కు—పన్ను (భూమిసిస్తుమొత్తంలో రు 1 కి రు 0-4-0,
కరువుపన్ను (భూమిసిస్తు మొత్తంలో రు 1 కి రు 0-4-0
కరువు భీమాపన్ను
పాడిపశువుల పన్ను
పశువిక్రయము పన్ను
పశుగ్రాసం పన్ను
నేతిపన్ను
ప్రత్తిపన్ను
ధాన్యాదుల విక్రయపు పన్ను
కూరగాయల పన్ను
బెల్లము పన్ను
పంచదార పన్ను
బాలికా వివాహము పన్ను
పెండ్లి పెద్దల పన్ను
పునర్వివాహముల పన్ను
ఫలవృక్షముల పన్ను
తపాలా పన్ను

## వ్యవసాయదారులుకానట్టి గ్రామస్థులు చెల్లించవలసిన పన్నులు.

| పన్ను వివరం | తలకు |
|---|---|
| వడ్డీవ్యాపారి, చిల్లరదుకాణదారుడు వగైరా | రు 4—0—0 |
| వడ్రింగి, దర్జీవగైరా | 3—8—0 |
| కమ్మరి | 3—0—0 |

| | |
|---|---|
| ఊడ్పుకూలీలు కోతకూలీలు వగైరా | 3—0—0 |
| దూదేకువాడు సాలీ వగైరా | 3—0—0 |
| వైవృత్తులకు చెందని తదితరులు | 2—0—0 |
| గొల్లలు వగైరా | 1—0—0 |
| బిచ్చగాండ్రు (బ్రాహ్మణులు, ఫకీరులు, సాధువులు,) | 1—0—0 |

ఇవిగాక

నేతిపన్ను
పశుగ్రాసముపన్ను
వృత్తిపన్ను
ఉప్పుపన్ను
కరువుపన్ను

నగరవాసులు చెల్లింపవలసినవి

నగరములోనికి దిగుమతియైన వస్తువులన్నిటిపైనను సుంకము,
ఇంటిపన్ను
బండిపన్ను
యుద్ధఋణపుపన్ను
పశుగ్రాసపుపన్ను
నేతియుత్పత్తిపన్ను
నేతి దిగుమతిపన్ను

ఇంకా పొగాకు, కిరసనాయిలు, పెట్రోలు, అగ్గిపెట్టెలు వగైరాలు అమ్మడం ఇజరాపాడి ఇందులో ఎవరెక్కువపాడితే వారికిమాత్రమే అమ్ముకొనే హక్కిస్తారు. ఇటు సంస్థానాధిపతికి ఇదియొక ఆదా, అటు ప్రజలకు ఎక్కువధరలకు కొనవలసినభారము. ఇవి మాత్రమేగాక ఈ సంస్థానమునకు 100 మైళ్ళ సముద్రతీరమున్నది. అందుజోడియా, బేడే, సాలియా,

అను రేవులుకలవు. వీనివలన దిగుమతిపన్నులు, ఎగుమతిపన్నులు చాలావరకువస్తవి. ఇంత ఆదాయము వసూలుచేయకపోతే వీరి భోగములను గౌరవాతిథ్యములకు ధనమెక్కడిది? ఈ విధంగా వసూలు చేయడం, ఈపైవిధంగా భోగలాలసత్వమునకు ఖర్చుచేయడం, అన్నిసంస్థానాలలో సమానమే. క్రొత్తజాతి లేడిఅడవిలో ప్రవేశించినదంటే, ఆ లేడికి గాయంతగిలినా, దానిని బాధపెట్టినా 5 సంవత్సరాల కఠినశిక్ష, వెయ్యిరూపాయిలు జరిమానా. వీరు వేటకువస్తే అచటిప్రజలు అన్నిసౌకర్యాలు చేకూర్పవలెను. మచ్చునకీ ఒక సంస్థానపు వివరాలు యివ్వబడినవి.

ఈ బాధలుభరింపలేక ఈ శిస్తులు చెల్లించలేక, ఈ అధికారుల విందులపుడు నిర్బంధసేవ చేయలేక రైతు లేమి, కూలీలేమీ, చచ్చి సగమై పోయిరి. లోలోపల స్వాతంత్ర్యాగ్ని ద్వేషానలము ప్రజ్వరిల్లుచుండెను. ఈవిధంగాఉంటే ప్రజాందోళనకు లోపమేమి, ఇచట ప్రజలలో చైతన్యంబయలుదేరి తీవ్రమైన ఆందోళన చేయుచుండగా- ప్రాతరాజుచనిపోయెను. యువకుడు, క్రొత్తరాజు. పరిస్థితులుగ్రహించాడు ప్రజలలో అలజడి మెదడుకెక్కించుకొన్నాడు. మూకీభావంవహిస్తే రాజ్యమే చెయిజారిపోతుందని గ్రహించాడు. ప్రజలుబాధ్యతాయుత పరిపాలనకా

వాలంటూ తెలియపరచారు. సిస్టులో 3 లక్షలు రిమిషనిచ్చానన్నాడు. నగరమ్యునిసిపల్ కౌన్సిల ర్లను ఎన్నుకొనే అధికారం ప్రజలకిచ్చానన్నాడు. ప్రజాశాంతిలేదు. ప్రాథమిక హక్కులు లేవు. బాధ్య తాయుత పరిపాలన విషయమే తేలలేదు. ప్రజలు బాధ్యతాయుత పరిపాలన కోసరం తీవ్రఆందోళన సాగించడానికి ప్రయత్నాలు పూర్తిఅయినవి. త్వర లో ఉద్యమం ప్రారంభంకాగలదు.

## ధరంగధర్

**వై. 1167 చ. మై. జనాభా 88,961. ఆదా య 21 లక్షలు కప్పం రు 40,671. బ్రిటిషు వారికి, రు 4006. జునగడ సంస్థానానికి. సాల్యూట్సు 12. ఫె. ఎ. 1/2 ఫె. కా. 1/2**

ఇది పశ్చిమ ఏజన్సీలోనిది. ఇక్కడ భూమిశిస్తుల బాధ అధికము. భూమిశిస్తు బకాయిక్రింద పెండ్లి కాని ఆడపిల్లలను జప్తుచేస్తారు. శిస్తు చెల్లించని వారినుండి శిస్తు వసూలు చేయడానికి మేకులు తాపిన చెప్పులను ఉపయోగిస్తారు. ఇంకా ఇట్టి బాధలు పెట్టుతారు. భరించలేక ప్రజలు కొంత అలజడి చేశారు. బాధ్యతాయుత పరిపాలన కావలెనని ప్రజలు కోరారు. ఈసందర్భంలో ముందువెనుకలు ఆలోచించి మ్యునిసిపాలిటీని

ప్రజాసంస్థగ చేశానంటూ సంస్థానాధిపతి ప్రకటన చేశాడు. కాని ప్రజలు మ్యునిసిపాలటీలోని వ్యవహారాలలో అవసరమైన అన్ని హక్కులు ప్రజలకు హస్తగతం చేయనేలేదనియు, అవసరమైన హక్కులు లేనపుడు, నిత్యవ్యవహారాలలో ప్రజలకు స్వతంత్రం లేనపుడు, ప్రజలు భరించలేని శిస్తులు చెల్లిస్తుంటే వానిలో తగ్గింపు లేనపుడు ఇక ఇచ్చినదేమున్నది. అందుచేత ప్రజలలో పూర్తి అసంతృప్తి జనించినది. ప్రాథమిక హక్కులు కావాలెనని, పరిపాలనలో ప్రజలకు బాధ్యత కావాలెనని ప్రజలు ప్రకటిస్తున్నారు, ఆందోళన చేస్తున్నారు. త్వరలో తీవ్రరూపం దాల్చు సూచనలు కన్పించుచున్నవి.

## గోండాల్

వై. 1024 చ. మై. జ. భా 2,05,846. ఆదా రు 50 లక్షలు. కప్పం బ్రిటీషువారికి రు 49,096. జూనగడకు రు 615. సా ల్యూట్సు 11. ఫె.ఎ.1/2. ఫి.కా. 1/2

ఇది పత్రికల వధ్యస్థానము. నిజంగా బ్రిటిషు ఇండియాలోనే చదువుకున్నవారు తక్కువ అయితే - ఇక సంస్థానాలలో చదువుకున్న వారెంతమంది ఉంటారు? ఈ చదువుకున్న కొద్దిమందిలోను ఎవరన్నా ఏదైనాపత్రిక తెప్పించుకుందామంటే ఎన్నో

పత్రికలు నిషేధింపబడినవి. ఒడ్డలే ,సౌరాష్ట్ర, ఫూల్‌ఛాబ్, రోషణీ, జన్మభూమి, ప్రజాబంధు, ప్రజామిత్ర, ప్రజామిత్రకేసరి, కథియవాడ్, ఒపీనియన్, జాగ్రతి, వాఫ్‌దార్, ఆశకార్, టాప్, బొంబేబజార్‌భావ్, కథియవాడ్‌పోల్, ఇంకా మరెన్నో - ఈవిధంగా పత్రికలు నిరోధించిన తర్వాత తలవని తలంపుగా ప్రజలలో రాజకీయ చైతన్యం బయలుదేరింది. ఇంకా అనేక పత్రికలు తెప్పించుకోవడం జరుగుతున్నది. రాజకీయరంగంలో దిగడానికి తీవ్ర ఆలోచనలు జరుగుచున్నవి. పత్రికలపై నిషేధం తొలగించవలెనని ప్రభుత్వాన్ని కోరారు. జవాబు కొరకు చూస్తున్నారు. అనుకూలంగా జవాబురాకపోతే ఆందోళన ప్రారంభించ నిశ్చయించారు.

## జాంనగర్

(ఈసంస్థానమునుగురించి పత్రికలలోనుగ్రంథములలోను చదువుట తటస్థించినది కాని, దీని వివరములుపరిభుత్వపు నివేదికలలో లభించుటలేదు. అందుచేఇవ్వలేదు)

ప్రజాస్వాతంత్ర్య వ్యక్తిస్వాతంత్ర్యం నిరోధిస్తూమాన సింహార్ఘూగాడిని అరెస్టుచేసి విచారణ అన్నమాట లేకుండా ఐదుసంవత్సరాలుంచిరి. లాల్‌పూర్ వాసిమాస్జీనాగ్జీని అరెస్టు ఫిర్యాదు విచారణలు

లేకుండా మూడుసంవత్సరాలు బందీగానుంచిరి. వారి సంగతికనుగొనుటకు అచ్చటకి వెళ్ళిన అతని సోదరునికూడా బందీనిచేశారు. అరుణజాగీర్ దారు అనే అతని సేవకులలో 50 మందిని ఒక్కసారిగా కారణంలేకుండా, తెలుపకుండా అరెస్టుచేసి సంవత్సరం చెరసాలలో ఉంచి నానాహింసలు పెట్టిరి. ఇచ్చట ప్రజలుకు అగ్గిపెట్టెలు, కిరసనాయిలు మొదలగువానిపై పన్నువేయడం తగదని లవణ ప్రసాద్ అనునాతడు ప్రభుత్వమునకు విజ్ఞప్తిని పంపుకుంటే ఆతనిని పట్టుకొని 45 దినములు జయిలులో ఉంచి అప్పటికీ దయదలచి వదిలామంటూ విడిచివేశారు. ఈ విధంగా సంస్థానంలో న్యాయం పౌరసత్వం కాపాడుబడుతున్నది! ప్రజలకు నిర్బంధం ఎక్కువఅయిపోవుచున్నది, అందుచే మొన్న 1939 జనవరిలో మహాత్మగాంధి బార్డోలీలో మకాంచేసినపుడు ఇచట ప్రజలు వెళ్ళి, తాము సత్యాగ్రహం సాగిస్తామని చెప్పివచ్చారు రేపోమాపో తీవ్రాందోళన సాగుచున్నదని వినుచున్నాము.

## జాభువా

వై. 1336 చ. మై. జ నా భా 1,45,522 ఆ దా. రు 5,68,000, కప్పం రు 1271, పి ప్ లో డా కు రు9,066. సాల్యూట్సు 11. ఫె.ఎ.1/3. ఫె.కా. 1/3.

ఈ సంస్థానాధిపతి ప్రజలను పీడించుకో తినడం బాగాసాగించాడు. భరింపలేక ప్రజలు ఎంతో ఆందోళనచేశారు. లాభంలేకపోయింది. ఇండియా గవర్నమెంటుకు తెలిపారు. అప్పటికీ లాభంలేక పోయింది. కాని ఇంగ్లాండు ప్రభుత్వంకూడా ప్రజా వాంఛను గౌరవించడం ఇష్టంలేకపోయినా స్వాధీన పరచుకోదలచిరి. 1900 లో కొన్ని హక్కులుతగ్గించిరి. యుద్ధంలోసహాయంచేస్తే 1918లో మరలవాని నిచ్చిరి. మరల ప్రజలను హింసించడం మానలేదు. మరల ఆందోళన సాగింది. మరల 1938 లో అధికారాలు తగ్గించిరి. ఇంతలో భారతదేశంలో రాజకీయ పోరాటంసాగుతుంటే మరల 1931 లో అతని అధికారాలాతనికిచ్చిరి. మరల ప్రజలలో తీవ్రసంచలనం ప్రారంభమైంది. సంస్థానాధిపతితన పనిమానలేదు. ప్రజలను బాధించడం. రాజ్యపరిపాలన సరిగ చేయకపోవడం మరల సాగించాడు. ఆపలేని ఉద్యమంగా ప్రజలలోనుండి వచ్చినది. బ్రిటీషుప్రభుత్వం కదిలింది. మరల 1934 సెప్టెంబరు 29 తేదీ అసలు ప్రభుత్వమే స్వాధీనపరచుకొని సంస్థానాధిపతిని

సంస్థానం వెలుపలనుండవలసినదిగా ప్రవాసంవేసిరి. ఒకకౌన్సిలు (చిన్నసంఘం)ను వేసి మాల్వా ఏజంటు అజమాయిషీలో పాలనసాగుతూవున్నది. అడ్మిని స్ట్రేటివ్ కౌన్సిలు పాలనపై ప్రజలు ఆందోళనచేస్తూ వున్నారు ఇదీఅంతకన్నా అధ్వాన్నమే! ముందుకర్తవ్యం తేల్చుకొనుటకు సమావేశంకానున్నారు.

## పాలిటానా

వై. 300 చ. మైళ్ళు. జనాభా 62,150. ఆదా రు 7,99,000. సాల్యూట్సు 9. కప్పము ఒకరాజుకు రు 7874. లును, జునగడ్‌కు రు 2690. ఫె. ఎ. 1/2 ఫె. కా. 1/3.

ఇచట రైతులు భరింపరాని పన్నులతోడను, కూలీలు నిర్బంధ సేవతోడను బాధపడుచున్నారు, ఎప్పటి కప్పుడు లోలోపల ప్రజాందోళన రగులు కొనుచునే యుండెను. అదిబయటికి ఉబకకుండెను. ప్రక్కన రాజకోటలోని ప్రజాందోళన ఇచ్చటి ప్రజలను స్వాతంత్ర్య ప్రియులనుజేసి ముందడుగు వేయు ధైర్యము నిచ్చెను. పాలిటానా దర్బారు హాలులో (?) సంస్థానప్రజా మహాసభ జరిపిరి. సంస్థానంలోని మూడుమహాల్‌ల ప్రాంతాలలో, భూమిశిస్తు నందు సంస్కరణములు అమలుపెట్టిరి. పాలిటానా సంస్థానంలోని అన్ని మహాల్లలోనూ

భూమిశిస్తులో యిచ్చిన ముజరా రు 1,80,000 లలో రిమిషన్ ఒకలక్షకుసమముగుననిఅంచనా వేయ బడెను. అసంతృప్తి,ఆందోళన సాగుచున్నవి. త్వరలో ఆందోళన సాగగలదు.

## శిర్మూర్

వై. 1046 చ. మైళ్ళు. జనాభా 1,48,568. ఆదాయ 609. వేలు. కప్పం లేదు. సాల్యూట్సు 11. ఫే. ఎ. 1/2. ఫె.కా.1/3.

శిర్మూర్ సంస్థాన ప్రజామండలి యేర్పాటైనది. ఈమండలి సమావేశమై బాధ్యతాయుత పరిపాలన వెంటనే నెలకొల్ప వలసినదంటూ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు. తీర్మానం చేయంగానే ప్రభుత్వం దృష్టిప్రసరించింది ప్రజాభిప్రాయం ప్రకటించినందుకు ఆత్మారాం మొదలైన కొందరను ప్రభుత్వం అరెస్టు చేసింది. 1939 జనవరి 7 వ తేదీ సంస్థానంలోని రైతులు సభచేశారు. ఉద్యమాన్ని బలపరచారు. సభలు ప్రదర్శనాలు జరుపుప్రయత్నాలుసాగుతూన్నవి. ప్రభుత్వం వారు నిర్బంధాలు చేస్తూవున్నారు. తీవ్రరూపం దాల్చే సూచనలు కాన్పిస్తున్నాయి.

## నాభా

వై. 947. చ. మై. జ నా భా 2,87,574. ఆ దా రు 2,55,50,000 క ప్పం లేదు. పా ల్యా ట్సు 13. ఫై. ఎ. 1, ఫై. గ. 1.

ఇది పంజాబులోని సంస్థానం. ఆనాడు 1923 లో బయలుదేరిన అకాలీ సత్యాగ్రహపు రోజులలో రహస్యంగా అకాలీలకు సహాయంచేశాడని, సానుభూతి ఉన్నదని అనుమానించి ఈ సంస్థానాధిపతి రిపుదమనసింగ్‌ను సంస్థానం వదలిపొమ్మన్నారు బ్రిటిషుప్రభుత్వం అడ్మినిస్ట్రేటర్ క్రిందవ్యవహరిస్తున్నారు. పిచ్చివాడిక్రింద లెక్క కట్టడానికి ప్రయత్నించారు. విధిలేక రాజ్యం త్యజించాడు.

1923 లో గుర్ - కా - బాగ్ సత్యాగ్రహ సందర్భములో ఇచట జెయిటోలోకూడా అరెస్టులు, నిర్బంధాలు, అత్యాచారాలు జరిగెను. వానికి జవహరలాల్ నెహ్రూ అతిథియాయెను. కొట్టడం, తన్నడం, సర్వసాధారణం. పరిపాలన తెలియని అధికారులు. తడి - ఎలుకల బాధతో జెయిళ్ళు, తీర్పు వ్రాయలేని మేజిస్ట్రేట్లు తీర్పు నకలు యివ్వని ప్రభుత్వం - ఇదంతా ఐ. సి. యస్ వారిపాలన క్రిందసుమండీ - ఈ సంస్థానాధిపతిని సంస్థానంలోనికి ఇంతవరకు రానీయలేదు. పాపం పెన్షన్ ఇస్తే జీవనం చేస్తున్నాడు. ఇంతలో ఇతని

బిడ్డలచేత, భార్యచేత ఈత డసమర్థుడనే వాదం బయలుదేర దీశారు. అనుమానంక్రింద పెట్టారు 1928 సం॥ ఫిబ్రవరిలో 1918 సం॥ 3 వరిగ్యులేషను ప్రకారం కొడైకెనాల్ (నీలగిరి) కొండలలో (డిపోర్టు) ప్రవాసం వేశారు. నేడక్కడ నేవున్నారు. ఆనాడుకాని, ఏనాడుకాని రాజకీయాభిప్రాయాలు కలిగివున్న, లేక అభిమానంవున్న సంస్థానాధిపతు లకు ఫలితం యిది. ఇప్పుడు కుమారుణ్ణి గద్దె నెక్కించామంటూరీజంట్ (మైనరుతరపున గార్డి యన్) కౌన్సిల్ అంటూ ఇంగ్లీషు ప్రభుత్వం యేలుతున్నది. ప్రజల స్థితిగతులు ఆలోచించే నాధుడు కన్పించడు. ప్రక్కనున్న దేశంలో పంట లేదంటే బ్రిటిషు రాష్ట్రంలోని ప్రభుత్వం పన్ను తగ్గించుచున్నది. మరొకప్రక్కనవున్న పాటియాలా లోని సంస్థానాధిపతి ప్రజలు తీవ్రంగాఅందో ళన చేస్తారేమోనని పన్ను తగ్గించాడు. ఇక్కడ ఎవరికి చెప్పుకునేటట్లు - ఎవరు వినేటట్లు? దరి దిక్కులేక ప్రజలు తీవ్రాందోళన సాగించ డానికి ఆలోచనలు చేస్తూవున్నారు. ప్రజలేవన్నా తమకష్టాలు చెప్పుకుంటే మాదేమున్నదంటూ కాలయాపన చేస్తువున్నారు. ఇదివరకే ఇక్కడ రాజకీయ చైతన్యంరగులుకొన్నది. త్వరలో తీవ్రాం దోళనసాగే చిహ్నాలు కన్పించుచున్నవి.

## పాటియాల

వై. 5942 చ. మై. జనాభా 16 25 520 ఆదాయ 1 50 18 వేలు సాల్యూట్సు 17 ఫై. ఎ. 2. ఫై.కా. 2 స్థానాలు:

ఇదివరకు సంస్థానాధిపతి భోగలాలసుడు. ప్రజల గోడేవిన పడడు. ఈ నడుమనే ఆతడు గతించెను. ఇచటి ప్రజలబాధలు చెప్పతరంగాదు. అన్నీ ఎడారి ప్రదేశాలు ఇసుకప్రదేశాలు. ప్రజలలో మతాభిమానంజాస్తి. రాజకీయ చైతన్యం కలుగుటకు అవకాశంకొద్ది. ఉన్నా నిర్బంధాలవల్ల బయటికి రాలేకపోయినారు. ఇపుడే ఆర్థిక బాధలు బయట చెప్పుకోగలిగారు ఆర్జిల పర్వంలో ఆందోళన సాగుతున్నది రిమిషను ఇప్పించవలెనంటూ ప్రజలు ఆందోళన ప్రారంభించారు. ఈయన రాజు, అంటే ప్రస్థుతరాజు రాజప్రాసాదాలనుండి దిగి ప్రజలలో తిరిగి తీవ్రాందోళనరాకుండా చేయతలంచినారు. ఈ సంవత్సరపు కరవు బాధవల్ల బాధపడుచున్న స్థలాలను అనే దానికన్న కొంత ఆందోళనబయలు దేరిన స్తలాలకు వెళ్ళి ప్రజలతో కలిసి సభలు చేస్తున్నాడు సంస్థానాధిపతి. ఈ సంవత్సరం రు 1, 33, 450 రిమిషను క్రిందనున్న రు 123,395 అనామతు క్రిందనున్న మొత్తము రు2, 56, 845లు భూమిసిస్తువసూలు ఆపుదలచేశానంటూ ప్రకటించి దానిని వన్నెల చిన్నెలతో ప్రజలలో ప్రచారం

చేస్తున్నారు. అర్జీల పర్వంనుండి ఆందోళన పర్వం ప్రారంభంకానున్నది. ఈమాత్రం రిమిమను ఈ సంస్థానంలో రావడం చరిత్రాత్మకమే, ప్రజాబలమే!

## కపుర్థల

వై. 599 చ. మైళ్ళు. జనాభా 3,16,757. ఆదాయం రు 15 లక్షలు. కప్పంలేదు. సాల్యూట్లు 13. ఫె. ఎ 1 ఫె. గా. 1. స్థానాలు.

ఫెడరేషను రాకపూర్వమే ప్రజలకు బాధ్యతాయుత పరిపాలన స్థాపింపబడేటందుకు ఆందోళన చేయవలెనంటూ 'కపుర్థల జాతీయసమితి' అనే సంస్థను 1938 సెప్టెంబరు నెలలో ప్రారంభించారు ప్రణాళికలో మొదట 26 గురు మాత్రమే సంతకాలు చేశారు. ఇపుడు వేలకు వేలు సంస్థలో సభ్యులుగా చేరుతున్నారు. ఇంకా సంస్థబలం ప్రజలలోని రాజకీయచైతన్యం, ప్రభుత్వ దృష్టిని ఇప్పుడే ఆకర్షిస్తున్నది. సంస్థానాధిపతి ఎసెంబ్లీని ఏవిధంగా నిర్మించవలెనో తెలియజేయుటకొక ఉపసంఘమును వేశారు. ఇదివరలో 1918 లోనే శాసనసభను స్థాపించారు. ఉండీ లేనిదానితో సమానమే. సభ సమావేశానికి మొఖం వాచింది. ఇపుడీ శాసనసభకు ప్రాణంపోసి మరికొన్ని అధికారాలిస్తానంటూ ఈమధ్య ప్రకటన

చేశారు. అందులో ఏన్నో దినాలుగా తన ఏకైక రాజపాలనతో తన ప్రజలు సంతృప్తి నందియే యున్నారనియు, నేటిరాజకీయ వాతావరణానికి, తనకు ప్రజారాజ్య విధానం అనులుజరుపడం ఉద్దేశంగావునను ఆలసించక వెంటనే 1916 లో నిర్మించిన శాసనసభను పునర్నిర్మించుట యెట్లో తెలుపుటకొరక ఉపసంఘమును వేసితిననియు తెలిపెను. ఏమి వీరినైపుణి - ఉదారంన్నూ; ప్రజలపై వీరికి వీరిపై ప్రజలకు చాల సంతృప్తిని ప్రకటించుకోవడంలోనేర్పు! ప్రజలలో కొంత సంచలనం బయలుదేరింది. ఆందోళన సాగింది. రాజకీయ సమస్య త్వరలో రానున్నది.

## లోహార్

వై. 226 చ. మై జనాభా 23 338 ఆదాయ 1 19 వేలు
కప్పంలేదు సాల్యూట్సు 9. ఫె ఎ 1/3 ఫె. కా. 1/3

ఈ సంస్థానం పంజాబులోనున్నది. ఈ సంస్థానాధిపతికి 1908 వరకు 48, 000 వచ్చేడిది. దానిని 1909 లో 73 వేలకు పెంచెను. 20 సంవత్సరాలకు రిసెటిల్‌మెంటు జరుగవలెను, 1923లో మరల సెటిల్‌మెంటు చేసి 94 వేలు పెంచారు. అపుడు వారసులు లేని వారిదిమాత్రమే గాక ఒక సంవత్సరం సేవ్యం చేయకుండావున్న భూములనుగూడా

స్వాధీనపరచుకున్నాడు. అప్పుబడేగొర్రె మీకపై పన్ను వేశాడు. ప్రజలుయివ్వలేమంటూ మొత్తు కున్నారు లాభంలేకపోయింది బ్రిటిషు ఏజంటుకు మొరపెట్టుకున్నారు. మొరపెట్టుకున్న సంవత్సర మల్లా కొంత ఫలిస్తూ వచ్చింది. సంస్థానపతికి ఇది కంటకంగా వుంది. 1935 ఆగస్టు 8 తేదీలలో ఏజంటు వస్తాడని నవాబేపుకారు పుట్టించాడు. తాను డేరాలు వేశాడు ఒకవూళ్ళో. అక్కడి రైతు లంతా కష్టాలు చెప్పుకుంటానికి వచ్చారు. నవాబు ముందు, తర్వాత ఏజంటుల కార్లు వెళ్ళిపోయినవి. పోగానే రైతులు లేచిరి. అదిగో వాళ్ళ పొగరు బోతుతనం చూడమని నవాబన్నాడు రైతులు ఏజంటును నవాబును తిరుగుబాటు చేసినారని చెప్పి తీసికొనివచ్చెను. ఈలేవడం తమనుకొట్టడానికి అన్నారు. అంతటితో లాఠీచార్జీలు, అరెస్టులు, కాల్పులు, జప్తులు, ఆడవారి మానభంగాలు, హత్యాకాండలు, అత్యాచారాలు చెప్పతరమా? మనవి జేసుకోపోతే మరణాలు ప్రాప్తించినవి. ఏజంటు వస్తాడు కష్టాలు చెప్పుకోమని ఇటు రైతు లకు చెప్పి అటు ఏజంటుతో రైతులు తనను తిరు గుబాటు చేశారని చెప్పి ప్రపంచాన్ని ఎంతమోస గించారో రైతులనెంత గొంతుకోత కోశారో చూడండి. ప్రజలలో తీవ్రసంచలనం ప్రారంభ

మైనది. తీవ్రోద్యమం సాగించు ప్రయత్నములు కొనసాగుచున్నవి.

## కాల్సియా

వై. 192 చ.మై. జనాభా 59,848. ఆదా రు 4,18000.
కప్పం లేదు.

పంజాబులోని సంస్థానం. ఇచట గొడ్లమార్కెటు పికెటింగుతో అసలుతగాదా ప్రారంభమైనది. మార్కెటుకువచ్చే గొడ్లపై పన్నుఅధికంగా వేస్తున్నారు. గొడ్లనుకొనుక్కునే బీదరైతుకు భారంఅవుతున్నది. అటు అమ్మేరైతుకు భారంఅవుతున్నది. ఇది తగ్గించమని అడిగారు. లాభంలేకపోయింది. మోగా రైలుస్టేషనువద్ద 2 నెలలనుండి సాగిపోతూన్నది. ఇపుడుభరించలేని పన్నులు తగ్గించవలెనని, రాజరికంలో కొంతఅధికారం కావాలెనని, వాక్సభా స్వాతంత్ర్యములుండ వలెనని కోరారు. నిర్మాణయుక్తంగా సాగుటకు పూర్తియేర్పాట్లు చేయబడుతూవున్నవి. ఈపోరాటంలో దాదాపు 100 మందిపైగా ఖైదీలుగాచేయబడ్డారు. ఏదో సర్దుబాటుచేసి కొందాంఅని రాజీపెట్టాడు ప్రభువు. ముందు ఖైదీలుగా వున్నవారిని వదలివేస్తే మాట్లాడుతామన్నారు ప్రజలు. ప్రతిష్ఠఅడ్డంవచ్చింది ప్రభువుకు. ఇది లాభం లేదని ఎట్లాగైన ప్రజోద్యమం పైకివస్తే తనకేనాడై

నా అవస్థయేనని తలంచి బ్రిటీషుప్రభుత్వం సహాయం కోరాడు. ఈ ఉద్యమంలో పాల్గొనేవారు పంజాబు రాష్ట్రంలోనుండీ బ్రిటీషు ప్రాంతాలనుండి సాగిస్తువున్నారు. అందుచేత పంజాబులో ఈ సంస్థానానికి చుట్టువున్న 5 జిల్లాలలో సంస్థానాధిపతుల రక్షణ (ప్రిన్సెస్ ప్రొటెక్షను) శాసనము అమలులో పెట్టారు. సంస్థాన ఉద్యమాన్ని గురించి మాట్లాడడం, సహాయం చెయ్యడం దీనిమూలంగా తప్పు. అంబాలాలో ఈ ఆక్టుక్రింద 25 మంది రైతులు అరెస్టు చేయబడ్డారు. ప్రతిరోజు చట్టాన్ని నిరోధిస్తూ 5 గురు వంతున అరెస్టుఅవుతున్నారు. సంస్థానంలోనుండీ, బ్రిటీషు రాష్ట్రంలోనుండి తగాదా తయారవుతున్నది తీవ్రఉద్యమం సాగుతూవున్నది. పంజాబు రాష్ట్ర ప్రభుత్వంకూడా ఇండియాప్రభుత్వంతో చేతులుకలిపి ప్రజాఉద్యమాన్ని అరికట్ట ప్రయత్నిస్తున్నది. ఈ మాత్రానికి ఆగేదిగా దీఉద్యమం. ఉద్యమమును నడుపునది పంజాబువీరులు కారూ!

## కాస్మీర్

వై. 84,258. జనాభా 36,46,243. ఆదాయ 2,52,95 వేలు. కప్పం రెండు కాశ్మీరశాల్వాలు, రెండు రుమాళ్ళు. సాల్యూట్సు 21. ఫై. ఎ. 4. ఫై. కా. 3 స్థానాలు.

ఇచట ప్రభువు హిందువు. ప్రజలు మహమ్మ

దీయుబు. ఏదన్నా రాజకీయబాధ చెప్పుకుంటే మతకలహం అంటారు. ఇది హైదరాబాదుకు తల క్రిందులు మొదటకా కాశ్మీర్ లో రైతులకు కరువువచ్చి సిస్తులు తగ్గించవలెనని కోరారు. వారు తమ కష్టాలు చెప్పుకొనబోతే, జతలు జతలుగా వూరేగింపులుగావస్తే అక్రమసంఘం అంటూ అందరినిఅరెస్టులు చేశారు. ప్రజలు భరింప రాని బాధలలో ఈ ఉద్యమం తీవ్రరూపందాల్చింది అరెస్టులపై అరెస్టులుసాగాయి. జతలు విరివిగారా కాప్రారంభించినవి. అదిమొదలు అరెస్టులు. లాఠీ ఛార్జిలు. తుపాకి కాల్పులు. అంతా యథాప్రకార కాండ సాగింది. సాగుతున్నది. ఇప్పటికి 950 మంది జెయిళ్లలో మ్రగ్గుతున్నారు. ప్రజలకు రాజకీయ అధికారాలు. బాధ్యతాయుత పరిపాలన యివ్వమని ఎక్కడనుండియో ప్రధానమంత్రిని తెచ్చేబదులు ప్రజల ప్రతినిధినే నియమించమని పౌరసత్వ హక్కులు యివ్వవలసినదని శిస్తు రిమి మనులు యివ్వవలెనని కోరుతున్నారు. ఈ నిర్బంధ విధానం ఒకతరహా గాకుండా ఒకప్పుడు ఆర్థిక చిక్కులలో వేసి. మరొకప్పుడు మతచిక్కులలో వేసి, మరొకపుడు రాజకీయ నిర్బంధములు కలి గించీ ప్రజలను పీడిస్తున్నారు. ఇంకా ఈ ఉద్యమం నిర్మాణయుక్తంగా యెప్పడ లేదనవలెను. ఇపుడు

కాంగ్రెస్ నాయకులతో అచటి ప్రజలు సంప్రదించారు. అచటి హిందువులు మహమ్మదీయులు కలిసి పోరాటం సాగిస్తున్నారు. బ్రిటిషు ఇండియాలో కాశ్మీర స్వాతంత్ర్య పోరాటానికి ప్రజాభిమానం బలపడుతున్నది. ఇది గ్రహించి సంస్థానాధిపతి ప్రజలకు ఆతీవ్రత తగ్గించుటకు 1939 ఫిబ్రవరి 14 వ తేదీ రాజకీయ సంస్కరణ లిచ్చాననటూ ప్రకటన చేశాడు. అందులో క్రొత్త శాసనసభలో ఎన్నుకొనబడేవారు 40 మందిన్ని తనుచే నియ నియమించబడేవారు 35 మందిన్ని మొత్తం 75 మంది సభ్యులు. ఉపాధ్యక్షుని సభ్యులే ఎన్నుకుంటారని, మంత్రుల సంఘం రాజుగారికే బాధ్యులని ఐతే శాసనసభకు మంత్రులకు కొంత సంబంధం వుటుందని. సభలో. బిల్లులు. తీర్మానాలు. ప్రశ్నలు మొదలైనవి చర్చించవచ్చుననిరి. వోటుచేసే అంశాలని, కానివికొన్ని అనీ నిర్ణయించారు. ప్రజల కిచ్చిన అధికారములు మృగ్యంగా వున్నవి ముఖ్యంగా పన్నులు, ఫీజు, పెనాల్టీలు, వీటికి అధికారం లేదట. త్వరలో జనరల్ ఎన్నికలు జరుపుతారట ఈ మెత్తులతో సంతృప్తి జెందక ప్రజలు తీవ్రపోరాటం సాగించు చున్నారు. బాధ్యతాయుత పరిపాలన్న పౌరసత్వహక్కులు, లభించేవరకు ఈపోరు ఘోరంగా సాగవలసినదే. ఎవరు మత

తగాదాలని దుర్బలపరచినను ప్రజలు వెనుకంజ వేయకు నిర్మాణయుక్తంగా త్వరలోనే పోరు సాగు చున్నది. ఈ సంస్థాన ప్రజామండలి సభ్యునొకనిని అఖిలభారత సంస్థాన ప్రజామండల కార్యవర్గంలో వేసికొన్నారు.

## ఉదయపూర్ (మేవార్)

వై. 12928. జనాభా 12,66,910. ఆదా రు 66,2[illegible] వేలు. సాల్యూట్సు 19. కప్పం రు 2,66,000 ఫే. ఎ 2. ఫె. కా. 2.

ఈ సంస్థానం చాలా ప్రాచీనమైనది. చరిత్రప్రసిద్ధమైనది. బ్రిటిషు రాష్ట్రంలోని అజ్మీర్ మార్వార్‌ల నుండి కొంతభాగంను అచటి ప్రజలు వద్దో మర్రో యంటున్నా వినక ఈ సంస్థానంలో కలపడంతో ప్రజలు పూర్తిగా తిరగబడ్డారు ఉదయపూర్‌లోను, నద్వార్‌లోను ఈ కారణాన 161 మంది జయిలుకి పోయినారు. ఇది ఇట్లుండగా ఈ సంస్థానంలో రైతుల ఘోష చెప్పతరంగాదు. దర్బారులోని ఉద్యోగస్థులకు బాగా శిస్తువసూలు చేస్తే బహుమతులిస్తారు సంస్థానాధీశులు. అంటే బాగుగా బాధించి వసూలుచేస్తే అందులో కొంత యిస్తా డన్నమాటేగా! ఇచ్చట జాగీరుదార్లు జాస్తి. వీరి ఖర్చు మరీజాస్తి. ఈనడుమ నిర్బంధ సేవను రద్దు

చేస్తూ ఒకశాసనం చేశారు. 1938 ఏప్రిల్ 4 వ తేదీ ప్రజామండలి యేర్పాటయింది. పైశాసనం అమలుజరిపించడానికి మ్యునిసిపల్ ఎన్నికలలో ప్రచారం చేయడానికి తలపెట్టింది. వారంరోజులలో వెయ్యిమంది సభ్యులు చేరారు. 20 రోజులకల్లా నోటీసన్నా లేకుండా ప్రజామండలిని అక్రమ సంఘంగా నిర్ణయించామన్నారు. ప్రజలు అది అన్యాయమని ఆందోళన చేస్తున్నారు. సత్యాగ్రహం ప్రారంభించారు. పురుషులు, స్త్రీలు అరెస్టయినారు. లాఠీఛార్జీ జరిగింది. కొందరు గాయపడ్డారు. సభలకు విరివిగా ప్రజలు వస్తూవున్నారు. ఇచ్చట సంస్థానాధీశునిపై ఏవగింపు బాగా ప్రబలింది. నిర్బంధవిధానం బాగా అమలు జరుగుచున్నది. ప్రజలు సత్యాగ్రహం సాగిస్తూవున్నారు.

## ఆళ్వారు

**వై.** 3158 చ. మై. జనాభా 749 751 ఆదాయ 37 80000 సాల్యూట్సు 15 ఫి. ఎ ఫి.కా.

ఈ సంస్థానంలో జనసంఖ్య పరిగణింప తగియున్నది. ప్రభువుకు రాజ్యపాలనపట్టదు. సంస్థానాధిపతి టీపార్టీలు, కులాసాలు చేయడంలో అగ్రగామి. ప్రజలు భరింపరానిపన్నులు చెల్లించ వలసిందే. కొన్ని కారణాలవల్ల అంటే పరిపాలన ధ్వంసం చేయడంవల్ల

భోగలాలసులగుటవల్ల రాజును వెడల నడిపి బ్రిటీషు అడ్మినిస్ట్రేషను (పరిపాలన) క్రిందికి తీసుకొన్నారు. సంస్థానంలో పన్నులభారం మితిమీరిపోవుచున్నవి. అది భరించలేక జనంఅంతా సంస్థానం వదలిపోయినారు. జనం తగ్గిపోయినా పన్నులు మాత్రం ఎక్కువ వసూలుచేశారు చూడండి.

| సం। | జనాభా | ఆదా(పౌండ్లు) |
|---|---|---|
| 1901 లో | 8 28 489 | 2 00 000 |
| 1911 లో | 7 31 668 | 3 50 000 |
| 1927 లో | 7 01 154 | 4 00 000 |

ఇపుడు మరల జనాభా శాస్త్రపెరిగినట్లు కన్పట్టుచున్నది. నవనగరులో ఉన్న పన్నులన్ని దాదాపుగా ఇక్కడావున్నవి. అంతేకాకుండా గవర్నరు జనరల్ మొదలగు వారెవరన్నావస్తే వారికి విందులకు, గౌరవ సత్కారాలకు ప్రజలు ఇపుడు కూడా పన్నులు ఎక్కువివ్వవలసినదే! ఈపైవిధంగా పన్ను పెరగడం ప్రజలుతరగడం చూస్తే ఈపన్నుల భారం భరింపలేక జనం లేచిపోతున్నరన్నమాట. ప్రజలకు పౌరసత్వహక్కులు లేవు. రాజుగారి స్వంత ఖర్చుతగ్గదు. ఇపుడు బ్రిటీషుప్రభుత్వం చేతిలో ఉండడంవల్ల స్వతంత్రించి ప్రజలవాంఛలు తీర్చడానికి మేమేమి చేయుగలం అని అంటారు. అధిపతి తప్పో ఒప్పో చేస్తాడా అంటే అతను లేడు. ప్రజలవాంఛలను

ఎగకొట్టడానికి ఒక అవకాశం బ్రిటీషు ప్రభుత్వా నికి. కాని ఇపుడిపుడే ప్రజలలో కొంతచైతన్యం బయలుదేరుతూవున్నది రాజకీయంగా చేయవలసింది ఏమీలాయనియుపక్షు భారంతగేదెట్లాగాయనిఅంమకు ఆందోళన చేయడానికి ఆలోచనలు సాగుతున్నవి. త్వరలోతీవ్ర ఉద్యమం వచ్చేసూచనలు కన్పిస్తున్నవి.

## గ్వాలియర్

**వై. 26,367. చ. మై. జ నా భా 35,23,007. ఆదా య 2,26,33,000 సా ల్యూ ట్సు 21. ఫై. ఎ. 4. ఫై. కా. 3.**

సింధియా కుటుంబ మూలపురుషుడు రాణాజీ. పీష్వాలవద్ద అంగరక్షకుడుగనుండి రాజాధిపతి యాయెను. మాల్వారాజ్యము నాక్రమించెను. 1759 లో గతించెను. ఇతనితర్వాత ఇతని పుత్రుడు జనకోజీ రాజ్యపీఠమధిష్ఠించెను. ఈతడు 1759 లో పానిపట్టు యుద్ధంలో చంపబడెను. ఈతని పినతండ్రి మధాజీసింధ్యా, రాణాజీచిన్న కుమారుడు, రాజ్యాధి పతియాయెను. నామమాత్రముగ పీష్వాకు సామంతుగనున్నను ఇతడు విదేశ సైనికబలము ఇతనిని హిందూస్థానాధిపతిని చేసెను. బ్రిటిషు వారీతనిని 1787 లో జయించిరి. అపుడీతడు ఇంగ్లీషు వారికిమహారాష్ట్రులకు రాయబారిగనుండి సాలా్బై

లో (1782) సంధి జరిపెను. అందుకు ఫలితంగా బ్రిటిషు వారీతని రాజ్య మీాతని కుంచివేసిరి. హిందూస్థానమున ప్రముఖుడాయెను. ఈతడు 1794 లో గతించెను. దౌలత్ రావు సింధియా 1795 లో రాజయ్యెను. మాధవరావు నారాయణ పీష్వాగతించిన తర్వాత సింధియా సైన్యబలావల్ల బాజీరావు పీష్వా రాజ్యాధిపతియాయెను. 1802 లోని బేసిన్ సంధివలన పూనాలోని బలమును ఈతడు మరల పుంజుకొనెను. అపుడు దౌలత్ రావు బీరారు రాజుతో మైత్రిచేసెను. జనరల్ (సేనాని) వెలస్లీకోరిన దురాశాపూరిత హిరణ్యాక్ష వరాలు తీర్చనందున యుద్ధమునకు కాలుదువ్వెను. ఈబ్రిటీషు వారి కుతంత్రయుద్ధములచే ఉత్తర హిందూ స్థానములోని ఈతని ప్రాబల్యము క్షీణించెను. సార్జీఅన్ జన్ గోక్ సంధిమూలముగా గోహడ్ - గ్వాలియరులు కోల్పోయెను. అందుపై ద్వేషానలముదహించివేయ మొదలిడెను. తోక త్రొక్కిన త్రాచువలె తీవ్రముగలేచి రెసిడెంటును ఖైదీచేసెను. దీనిపై కోపించి బ్రిటిషు ప్రభుత్వం ఇతనిపై కసితీర్చుకోదలచెను. కాని ఇంతలోకే కార్న్ వాలీసు ప్రభువు గవర్నరు జనరల్ గ వచ్చుట తటస్థించెను. ప్రభుత్వము తాటస్థ్య విధాన మవలంభించ దలచినందున ఘోహడ్ - గ్వాలియర్ లు

సింధియాకిచ్చునట్లును, సింధియా అధీనములోనున్న జోథ్‌పూర్, కోట సంస్థానాధిపతులతోగాని మాల్వా రాజపుత్ర సంస్థానాధిపతులతోగాని ఇంగ్లాండు ప్రభుత్వం సంధి చేసికోదనియు నిబంధనలు వ్రాసికొనిరి. పిండారీల దండయాత్రల సమయములో (1817) లో ఈనిబంధన రద్దుచేసుకొనిరి. 1818 లో బ్రిటిషువారు ఆజ్మీరు మొదలగు కొన్ని ప్రాంతములను తీసికొని సమమగు ప్రాంతములను (వైశాల్యంలో కాబోలు)వీరికిచ్చిరి. పిండారీ యుద్ధానంతరం బలహీనమైన మాల్వాప్రాంత రాజపుత్ర రాజులను పరికించి వారు తమకు సామంతులుగ నుండునట్లును, మర్యాదగ ప్రవర్తించి సన్నాళ్లు రాజ్యాలు వారే వుంచుకొనునట్లును అంగీకరించిరి.

1827 లో దౌలత్‌రావు సింధియా గతించెను. ఆలిజాజానకిరావుచుదత్తుచేసి, సింధియాభార్య బైజాబాయి రీజన్సీ (గార్డియన్)గా రాజ్యపాలన జరిపిరి. ఈ బైజాబాయికి రాజ్యకాంక్షపుట్టి దత్తపుత్రుడగు యువరాజును నిర్బంధాలపాలు చేసెను. ప్రజల అసంతృప్తికి పాలాయెను. ఈసమస్యపై సైన్యం ఎదురు తిరిగెను. గత్యంతరంలేక ఈమె గ్వాలియర్ సరిహద్దులు విడిచిపోయెను. యువరాజగు జానక్జీ మేనమామ మంత్రిత్వం స్వీకరించెను. ఈతడు ఆమె వలెనే వ్యవహరింప దొడగెను.

మైనరైన జానకీరావు సింధియా చనిపోయెను జాన్గ్జి సింధియాను కుట్రపన్ని చంపినట్లు అనుమానింపబడెను. సైన్యంలో తిరుగుబాటు కలిగెను. జాన్గ్జి భార్య వయస్సు 12 సంవత్సరములు ఆమెకు 8 సంవత్సరముల బాలుని దత్తుచేసిరి. గద్దె నెక్కించిరి. మైనరు తరపున మామా సాహేబు బ్రిటీషు వారిని పట్టుకొని మంత్రిగ జేరెను. ఇంగ్లీషు వారితో కలిసి సంస్థానానికి, తదధిపతికి ద్రోహం చేయసాగెను. దాదాఖాన్గివాలా అను నతడు వీని దుర్మార్గములను ప్రచురపరచెను. చివరకు మామాసాహెబు సంస్థానమునుండి తరిమివేయబడెను. దాదాఖాన్గివాలా రాజ్యమును ప్రజానురంజకంగా చేసెను. బ్రిటీషు వారి ఆటలుసాగనీయలేదు. సంస్థానాభివృద్ధి విరోధకుడుగనున్నందున రెసిడెంటును తొలగించెను. బ్రిటీషు వారీతనిపై పగబట్టిరి. ఈతడు తగ్గిరానిచో యుద్ధము సిద్ధమనిరి. బ్రిటిషుసైన్యము గ్వాలియరుపై బడెను. గవర్నరు జనరలున్నూ సంస్థానాధిపతి 1843 డిసెంబరు 20 వ హింగానావద్ద సమావేశమగుటకు నిశ్చయింపబడెను. అచటికి బ్రిటిషుసైన్యంవచ్చి తగాదా ప్రారంభించెను. అందుపై సింధియాసైన్యం వారిని తీవ్రంగా ఎదుర్కొనెను కాని పరాజితులైరి. 1884 జనవరి 10 వ తేదీ సంధిచేసుకొనిరి, ఈ యుద్ధ

ఖర్చుల క్రిందను సైన్యమును నిల్వవుంచి దానిని నిర్వహించుటకును చాలాభూప్రదేశమును బ్రిటిషువారు తీసికొనునట్లును, ఆశ్వీక సైన్యం 3000 లు కాల్బలము 200 మంది 20 తుపాకులకు మించకుండ నుండునట్లును సైన్యమును తగ్గించిరి. రాజు మైనారిటిలో రెసిడెంటు ఇష్టమువచ్చినట్లు రాజ్యపరిపాలన జరుగునట్లు, గ్వాలియర్ సరిహద్దులను బ్రిటిషువారు రక్షించునట్లు సంధిచేసుకొనిరి.

ఈ రెసిడెంటు ప్రజలసొత్తును అపహరించుట ప్రజలను హింసించుట, ఇచటి ధనమును ఇంగ్లాండుకు చేర్చుట ఇది ఆనాటి అననేల, ఈనాటికికూడా రెసిడెంట్లు ఆదర్శముగా వ్యవహరించుచుండెను. దేశీయ జాతీయ చైతన్యం ప్రబలెను. అవి విప్లవ దినములు. బ్రిటిషువారిని ఇండియానుండి తరిమి వేయవలెనను విప్లవజ్వాలలు తీవ్రంగా ప్రబలియున్న రోజులు. తాంతియాతోప్ యాజమాన్యమున ఇచటి సైనికులు 1857 లో తిరుగుబాటు చేసిరి. రెసిడెంటుగ్వాలియర్‌ను విడచి పారిపోయెను. విప్లవము నణంచుటకు బ్రిటిషువారికి తనసైన్యమిచ్చి మహారాజు ఆగ్రాలో తలదాచుకొనెను. ఆనాటి సిపాయి విప్లవము తగు నిర్మాణయుక్తంగా జరుగనందున విజయము పొందలేక పోయెను.

సిపాయి విప్లవములో బ్రిటిషువారికి సహాయం చేసి ధారకం చేసినందుకు వారికి వీరు - వీరికివారే ద్రిక్కైరి! అందుచే మెహార్బానీగా 3 లక్షల ఆదావచ్చు భూభాగం బ్రిటిషువారీతనికి అదనంగా యిచ్చిరి. పెద్ద హోదాయిచ్చామనిరి. రాజ్యమతనికి యిచ్చిరి. 1858 లో గ్వాలియర్ కోట బ్రిటిషువారి స్వాధీనమాయెను. 1886 లో మార్చి 10 న భారతవీరతార లక్ష్మీభాయి రాజధాని ఝూన్సీకోటను బ్రిటిషువారు స్వాధీనపరచుకొనిరి. ఆనాడే గ్వాలియరుకోటను సింధియాకిచ్చిరి. 1886 లో జాయాజీరావు సింధియా గతించెను. ఆతని పుత్రుడు మాధవరావు మైనరు గద్దెనెక్కెను 1894 వరకు రీజన్సీకౌన్సిలు పాలనక్రింద జరిగెను. అప్పటికిది చాలా వైశాల్యయుతమైన సంస్థానం. ఇంత సంస్థానము ఒకరి చేతి క్రిందనే యుండుట తమకు క్షేమముకాదని బ్రిటిషువారు 43 జాగీరుదారులకు తలకొక జాగీరునిచ్చిరి. బలహీనపరచిరి. మాధవరావు రాజ్యాధిపతియై 1925 లో గతించెను

అంతట జార్జి జీవాజీరావు (జననం 1916) మైనరైనందున రీజంటుగా తల్లి నేర్పరచిరి. రీజన్సీ కౌన్సిలు ద్వారా రాజ్యమేలుచుండిరి. ఈమె 1931 లో గతించెను. ఇపుడు బ్రిటిషువారి అడ్మినిస్ట్రేషన్ (పాలన) క్రిందనున్నది. ఇది సంస్థానాల పరిపాలన-

సిపాయి విప్లవములో బ్రిటిషువారికి సహాయం చేసి ధారకం చేసినందుకు వారికి వీరు - వీరికివారే దిక్కైరి! అందుచే మెహర్బానీగా 3 లక్షల ఆదావచ్చు భూభాగం బ్రిటిషువారీతనికి అదనంగా యిచ్చిరి. పెద్ద హోదాయిచ్చామనిరి. రాజ్యమతనికి యిచ్చిరి. 1858 లో గ్వాలియర్ కోట బ్రిటిషువారి స్వాధీనమాయెను. 1886 లో మార్చి 10 న భారతవీరతార లక్ష్మీభాయి రాజధాని ఝాన్సీకోటను బ్రిటిషువారు స్వాధీనపరచుకొనిరి. ఆనాడే గ్వాలియరుకోటను సింధియాకిచ్చిరి. 1886 లో జాయాజీరావు సింధియా గతించెను, ఆతని పుత్రుడు మాధవరావు మైనరు గద్దెనెక్కెను 1894 వరకు రీజన్సీకౌన్సిలు పాలనక్రింద జరిగెను. అప్పటికిది చాలా వైశాల్యయుతమైన సంస్థానం. ఇంత సంస్థానము ఒకరి చేతి క్రిందనే యుండుట తమకు క్షేమముకాదని బ్రిటిషువారు 43 జాగీరుదారులకు తలకొక జాగీరునిచ్చిరి. బలహీనపరచిరి. మాధవరావు రాజ్యాధిపతియై 1925 లో గతించెను

అంతట జార్జి జీవాజీరావు (జననం 1916) మైనరైనందున రీజంటుగా తల్లి నేర్పరచిరి. రీజన్సీ కౌన్సిలు ద్వారా రాజ్యమేలుచుండిరి, ఈమె 1931 లో గతించెను. ఇపుడు బ్రిటిషువారి అడ్మినిస్ట్రేషన్ (పాలన) క్రిందనున్నది. ఇది సంస్థానాల పరిపాలన-

1932, 33, సంవత్సరాలలో పంటలు పండక రైతులు సిస్తులు చెల్లింపలేకపోయిరి. ప్రభువు పెట్టు బాధపడలేక చివరకు కన్నబిడ్డలను అమ్ముకొని సిస్తుచెల్లించిరి, అనిన రైతులెట్టి దరిద్రావస్థలో నుండిరో ప్రభువెంత కఠినంగా ప్రవర్తించెనో బోధపడగలదు. ఈ అమ్మబడిన బిడ్డలచేత చెప్పరాని చాకిరి చేయించుకొనిరి. ఇటు రైతులచేత కూలి కూడా యివ్వకుండనే వెట్టిచాకిరి విధివిరుగడ లేకుండా చేయించుకొనుచుండిరి. ఇది భరింపలేక పోయిరి. దిక్కుదరి తోచక ఇండ్లు వాకిళ్ళు విడచి పోసాగిరి. తిండిలేక ఎక్కడైనా లభించునాయని భిల్లుడొకడు బిడ్డలతో దోహద్ గ్రామంచేరి పొట్టు పోసుకునే ఆస గాకాన్పించక కన్నబిడ్డలతో సైతం నూతిలోబడి ఆత్మహత్య గావించుకొన్నాడు. జరిగిన హృదయ విదారక దృశ్యాలలో - కథలలో ఇదియొకటి. ప్రభుత్వము ప్రజలస్థితి యోజించదు. ప్రజలలో ఇంత దరిద్రం - ఉన్నదంటే అగ్నిపర్వతం భగ్గుమన్నట్లెప్పుడో రగుల్కొంటుంది. శ్రామిక జీవులలో రాజకీయ, అర్థిక ప్రచారం ఇపుడిపుడే సాగుతున్నది. నిర్మాణయుతంగా ప్రభుత్వంతో తిరుగుబాటు చేయడానికి ఆలోచనలు జరుగుతూవున్నవి. త్వరలో ఉద్యమం విజృంభించక తప్పుతుందా!

## భోపాల్

వై: 6924. జనాభా 7,29,955 ఆదాయాలు రు 80 లక్షల పాల్యాట్సు 11 .కప్పం రు1,61,290 ఫె. ఎ. 3 ఫె. కా. 2 స్థానాలు

ఇది పత్రికల వధ్యస్థానము. సుభాయివతన్, వతన్ స్థని ముషేరవతన్, కర్యాక్, అజాద్, రెహాదోమా షహాన్, పరిజాప్రకార్, ప్రజామిత్ర పత్రికలు విపరీతముగు సెక్యూరిటీలు కోరినందున చెల్లించలేక, చెల్లించినమ తిరిగివచ్చు నమ్మకంలేక నిలిపివేసిరి. ఇవిగాక ఇతర రాష్ట్రాలనుండి వచ్చే ప్రతికలను 13 ని నిషేధించారు. రాజద్రోహనేరం క్రింద మూడు సంవత్సరాలలో 16 మందిని అరెస్టు చేసి సంవత్సరన్నరనుండి 2 నెలలకు తక్కువగాని వివిధవ్యవధులతో శిక్షలు వేసి జెయిళ్ళల్లో మ్రగ్గచేస్తున్నారు. పోస్టులో ఉత్తరాలు చేరుట అనుమానం. పోస్టుశాఖ అంతా సి. ఐ. డీ చేతులలోనే వుంది. పౌరసత్వ హక్కుల సంఘమువారు సంస్థానాలలోని పరిస్థితులు విచారణ చేయవలసినదని ప్రభుత్వాంను కోరుతే వల్లకాదన్నారు. సంస్థానంలో తీవ్రమగు ఆందోళన సాగింది. అసలు బయటికికూడా తెలియలేదా అన్నంత నిర్బంధాలు అమలు జరిపారు ప్రజలు అకుంఠితంగానే సాగించారు. 1939 జనవరి 10 వ తేదీ పత్రికలపైనున్న నిషేధాన్ని తొలగిస్తూ సంస్థానాధిపతి ప్రక

టించారు. 11 వ శ్రేదీ రాజకీయ సంస్కరణలు ప్రకటించారు భోపాల్ మ్యునిసిపాలిటీకి 5 స్థానాలు పెంచారు ఇవిఎన్ను కోవలసినవే! 5 ప్రజలచే ఎన్ను కోబడ్డవారు 5 గురు సంస్థానం వారిచే నియమింప బడ్డవారు మొత్తం 10 మంది గల సంఘము సంస్థానంలోని స్థానికపాలనావ్యవహారాలు నిర్వంచడానికి నిర్మాణం చేశారు. దీనికి అధ్యక్షుణ్ణి సంస్థాన సభా బే నియమిస్తాడు. బాధ్యతాయుత పరిపాలనకు దీనికి ఎంత దూరముందోచూడండి! ప్రజలకు సంతృప్తి లేదు. కర్తవ్యమును గూర్చి యోజించుచున్నారు. తీవ్రోద్యము త్వరలోరానున్నది.

## సీతామావ్

వై. 202 చ.మై. జనాభా 28,422.ఆదా రు271 వేలు. సాల్యూట్సు 11. కప్పం 27,500. (ఒకసంస్థానాని) ఫై. ఎ. 1/3. ఫై. కా. 1/3. స్థానాలు.

ఈ సంస్థాన ప్రజలలో కొంతరాజకీయ చైతన్యం కలిగింది. అందుపై సక్రమ అందోళన బ్రజలు ప్రారంభించారు. సభలు, ప్రచారం సాగించారు. బాధ్యతాయుత ప్రభుత్వం కావాలెనంటూ ప్రభుత్వాన్ని కోరారు. ఒక కొంత ఆందోళనచేసి ప్రభుత్వ దృష్టికి తేగలిగారు. 1939 జులైలో అమలుకు రావాలెనంటూ సంస్థానాధిపతి సంప్క-

రణాలు కొన్ని ప్రకటించారు. ప్రజాపరిషత్ అనే శాసనసభ వుంటుంది. అందులో 6 అధికారులు, 2 అనధికారులు మొత్తము 8 మంది నామినేటెడ్ సభ్యులును, 13 గురు ఎన్నుకోబడ్డవారు మొత్తము 21 మంది సభ్యులుంటారు. విద్య, ఆరోగ్యం, మ్యునిసిపాలిటీలు, పంచాయితీ కోర్టులువీనిపై అధికారం ఈ శాసనసభ కుండును. సాలుసరి బడ్జెటు ఈ పరిషత్ లో చర్చకు తేబడును. కౌన్సిల్ ఒకటి ఉండును. ఇది కార్యనిర్వాహణాధికారసంస్థ అయియుండును. అది యువరాజు ఆధీనంలో ఉండును. పరషత్ తరపున దీనిలో నొకరుందురు. ఓటర్లు నియోజకవర్గాలు మొదలగు వానినిగుఱించి విచారించుట కొక ఉపసంఘమును వేయుచు (ది 28-12-38) నొక ప్రకటన దర్బార్ వారు ప్రకటించిరి. సంస్కరణలలో మార్పులు సూచించుటకు శాసనసభలోని $\frac{3}{4}$ వంతు సభ్యుల కధికారంకలదు. సూత్రాలలో బాగుగా కన్పడుతుంది. మాటలలో పొందికగనే వుంటవి. కాని అసలువారిస్తామన్న సంస్కరణలు అమలుకువచ్చి, అమలుజరిగితేనేగాని అసలు నిజస్వరూపం బయలుపడదు. ఈపైసంస్కరణలు చాలనే చాలవు. అసలు దీనిలో బాధ్యతాయుత ప్రపాలన ఛాయకూడా లేదని ప్రజలలో అలజడి బయలుదేరినది. ఉద్యమం సాగుతుంది.

## కోట

వై. 5725. చ. మై. జనాభా 6,85,804. ఆదా
రు 40,07. వేలు. కప్పం రు 4,34,720. సాల్యూట్సు
17. ఫె. ఎ. 1. ఫె. కా. 1 స్థానాలు.

తూర్పు రాజపుత్ర సంస్థానములలోనిది. ఇచట నిర్బంధసేవ బాగా సాగుతుంది. దీనినే బేగార్ అంటారు. ప్రజాసంతృప్తికై బయటివారిని పొరపర చుటకును రాజు ఈ నిర్బంధసేవను నిషేధిస్తూ శాసనమొకటి చేశారు. ఆశాసనాన్ని అచటి బ్రిటీషు ఏజంటు 'ఈబేగార్ బానిసత్వంకాదు. ప్రజలకు ప్రభువులకు మధ్యనున్న ప్రేమనువెల్లడిస్తున్నది. ఈ ప్రేమవలన చాకిరీచేస్తారు. ప్రభువు (ఈబేగార్ చేసిన) వారికేదో యిస్తాడు. బ్రిటిషు ప్రభుత్వముక్రింద మాత్రం ఇదిలేదా? ఎక్కడయినా సరే ఇదిరద్దుచేస్తే నేను చాలా విచారపడుతాను. సంస్థానాలలో ఇది చిరకాలం వర్ధిల్లాలెనని కోరుతున్నాను' అని అన్నారు. ఈశాసనాన్నిచూచి ఇతర సంస్థానాలలో కూడా నిర్బంధసేవను నిషేధిస్తు శాసనాలు చేయవలెనంటూ ఆందోళన వస్తుందిఅని తలచి భయపడ్డాడు. భారతదేశపు ప్రతినిధి అంత ర్జాతీయ బానిసతనాన్ని గురించి విచారించిన కమిషను ముందు భారతదేశంలో బానిసతనం లేదన్నాడు - ఇట, ఈవిధంగా సాగిపోతూంది.

బానిసతనం(బేగార్) భరింపలేక రైతులు, కూలీలు లోలోన కుళ్ళి క్రుగ్గిపోతున్నాను. అసంతృప్తి అసహిష్ణుత తీవ్రరూపం దాల్చింది. నిర్బంధసేవ తొలగించవలెనంటూ ప్రచారం సాగిపోతున్నది. ఇపుడిపుడే ప్రభుత్వదృష్టికి వస్తున్నది - త్వరలో తీవ్ర ఉద్యమరూపం దాల్చవచ్చును.

బూంది

వై. 2290 చ. మై. జ నా భా 2 16 722 ఆదా రు1669 వేలు కప్పం రు 1 20 000 సాల్యూట్సు 17 ఫై. ఎ. ½ ఫై. కా. 1 స్థానం

ఇదీ తూర్పురాజపుత్రస్థానములోనిదే ప్రజలకు పన్నుభారంజాస్తి. ఊడిగం సంస్థానాధిపతికీ, అధికారులకు, నౌకర్లకు ప్రజలు చేయవలసిందే. ఇచ్చట బేగార్ నడుస్తూవున్నది ఈ సంస్థానంలోని ప్రజలకు సంబంధించిన నిబంధనలలో 78 వ నిబంధన ఈప్రకారంగా వున్నది. ప్రభుత్వమునకు పనిచేసిన కూలీలకు తిండీమాత్రం పెట్టుదురు ప్రభుత్వఉద్యోగులకు పనిచేస్తే కూలీయిస్తారు కాని ఈ పనికై ప్రత్యేకించబడినవారే దానిని చేయవలెను అటుల పనిచేయుటకు (రోగంరాని, ఇంట్లో ఎవడన్నా చావనీ ఏమైనాసరే) నిరాకరిస్తే కఠినశిక్ష. ఈ విధంగా నిబంధనలో ఉన్నది. ఇంత త్రీవంగా తిండికి పనిచేయాలెనని కాకితాలలో

నిబంధనలలో వుంటే సంస్థానంవారు పనిచేయించు కుంటే తిండి పెట్టనే పెట్టరు. ఒకవేళ పెట్టమని డబ్బి యిస్తారా నడుంగా అధికారులు మింగివేస్తారు. ప్రభుత్వం తిండిపెట్టమని డబ్బుయిస్తే ఆడబ్బును మింగే అధికారులు తమకుపనిచేయించుకొని నిబంధన ప్రకారం కూలీయిస్తారంటే ఎవరన్న నమ్మ తారు? ఇవ్వలేదని చెప్పుకుండేది ఎవరికి? ఈవిధంగా శ్రమికవర్గానికి జెందిన కూలీలస్థితి నాదారు రైతు స్థితి వుంది. ఇపుడే ఈ నిర్బంధ కూలీపద్ధతి పోవలెనంటూ ప్రచారంసాగింది. ఒక రూపంలోకి దిగుతున్నది. త్వరలో ఉద్యమం వచ్చే సూచనలు కన్పిస్తూన్నాయి.

## బికనీరు

వై. 23 317 చ. మై. జ. భా 9 36 218 ఆదాయం రు 1 19 25 వేలు కప్పం లేదు సాల్యూట్సు 17. ఫి. ఎ 1 ఫి. గా 2 స్థానాలు

ప్రజలకు వైద్యసహాయంసున్నా. విద్యకు $1\frac{1}{2}$ వైద్యమునకు $1\frac{1}{3}$ నూటికి ఖర్చుచేస్తాడు. తనకు వచ్చే ఆదాయములో నూటికి $3\frac{1}{3}$ సంస్థాన ప్రజలకు నూటికి $22\frac{1}{3}$ తన స్వంతఖర్చులకు వాడు కుంటు న్నాడు. పాపం! స్వంతయిండ్ల ఖర్చంతా డిపిడబ్యు శాఖ క్రిందనే లెక్క, వాహనక స్వంతం, బానిసత్వం

బాగా అమలగుతున్నది. పెండ్లిఅయితే పెండ్లి కూతురుతోబాటు కొందరు బానిసలను హారణం యిస్తారు, మనవాంధ్రుడు ఆవులు గేదెలు యిచ్చినట్లు. ఈ బానిసలను అమ్మవచ్చు. భార్యాభర్తలను విడదీసి అమ్మవచ్చు. తిండిపెట్టినా పెట్టకపోయినా పని మాత్రం బాగా చేయించుకొంటారు. 1921 లో బానిసలు 10 వేల మంది. ఇదిరద్దు చేసినట్లు శాసనాలున్నాయి. ఆశాసనాలన్ని పుస్తకాలలో పదిలపరిచారు. అమలులో పూర్తి బానిస వ్యాపారం సాగిపోతూన్నది. అది ముఖ్యంగా రాజప్రాసాదాలలో అధికం. ఈబానిస నిరోధక శాసనాలలోని సారాంశాలు ప్రచారంచేస్తే రాజద్రోహం. ఇపుడిపుడు ప్రజలు అవకాశం తీసికొని బానిసనిరోధ ప్రచారం చేస్తున్నారు. కొంత తీవ్రస్వరూపం దాల్చింది. ఇది ఇట్లావుంటే ఈసంస్థానంలో ఎసెంబ్లీ వున్నది. సభ్యులప్రాతినిధ్యం ప్రజలకుచెందిందికాదు. ఈశాసన సభ 1929 వ సంవత్సరములో ఏప్రిలుల్‌లో సమావేశమై రెండు రోజులలో అంటే కొన్ని ఘంటలలో-రాత్రిళ్లు సభలుజరుపరుగా-బడ్జట్ అంగీకరించింది. ఇంతత్వరలో ఒకసంస్థానంబడ్జట్టు కొన్నిగంటలలో ముగించడం ప్రపంచంలోని ఎనిమిదవ అద్భుతం. ప్రజలలో చైతన్యకలిగింది. బాధ్యతాయుత పరిపాలన కావలెనంటూ ఆందోళన ప్రారంభించారు.

ఉద్యమం సాగుటకు ఏర్పాట్లు జరుతున్నవి. త్వరలో తీవ్రఉద్యమం వచ్చేలాగుంది.

## ఇండూరు

**వై. 9,902. చ. మై.** జనసంఖ్య **13,25,089.** ఆదా **రు 117.** లక్షలు. కప్పం లేదు. సాల్యూట్సు **19.** ఫే. ఎ. **2.** ఫే. కా. **2.** స్థానాలు.

1937 లో 30 వేలమంది బట్టలమిల్లు కూలీలు సమ్మెచేశారు. అంగ పైమంత్రిపాట్నాఒక పరిష్కారం చేశాడు. ఆపరిష్కారం కూలీల కన్యాయం చేసింది. అందుచేత కూలీల కిష్టంలేకపోయింది. విమర్శలు ప్రారంభమైనవి. అపుడు ఆచర్చలు ఆపడానికి ఇండూరులో నొక ఆర్డినెన్సు జారీ అయింది. సభలు జరుపకూడదన్నారు ఇదికూలీల మీదదెబ్బ. 100 మందిగల కూలీలసమ్మెలో పాల్గొనడంగాని, ప్రోత్సహించడంగాని నేరం అన్నారు. కార్మికులనోరు కట్టివేశారు. పోలీసులకు అంతా అధికారం వప్పచెప్పారు. ప్రజలలో అసంతృప్తి, ద్వేషం రగుల్కొన్నది. చైతన్యం కలిగింది. పౌరసత్వాలుపోతే ఇక గత్యంతరమేమిటని తలచారు. తీవ్రంగా పోరు సాగించారు. ప్రాథమిక హక్కులు యిస్తేనేగాని వీలులేదని గట్టిగా ప్రజలన్నతరువాత తక్కిన పెద్దసంస్థానాధిపతులవలెగాక

కొంత ముందువెనుక లాలోచించి ఇండూరులోని మ్యునిసిపల్ ఆవరణలో బహిరంగ సభలుజరుపుకొనుట కదివరకు అమలుజరిపిన నిషేధాన్ని తొలగించారు. ఇచ్చిందిలేదు. మరికొన్ని ప్రాథమిక హక్కు లిచ్చానన్నాడు. ఇంకా సంస్థానంలో సభలు చేసికొనేహక్కు రాలేదు. ప్రజలు లోలోపల తీవ్రాందోళన సాగిస్తూనే వున్నారు. బయటికి కబురు చేరటంలేదు. వీరిదివరలో ఒక శాసన సభను నిర్మించారు కాని ప్రజలకు అధికారాలు అవకాశాలు అందులో కల్పించబడలేదు. ఇపుడు ఆశాసనసభలో ప్రజలకు పరిపాలనాధికారం యివ్వవలెనని, బాధ్యతాయుత పరిపాలన ప్రజల వశం చేయవలసిందంటూ ఉద్యమం సాగుతున్నది.

## జయపూర్

వైశాల్యము 15 590 చ. మై. జనాభా 26 31 775
ఆదాయము రు 125 లక్షలు సాల్యూట్సు 17 ఫె. అ. 3
కౌన్సిలులో 2 స్థానాలు కలవు

ప్రజలపై తమబలాన్ని ఏదోవిధంచేత ప్రయోగించినందున సికార్ ప్రజలకు ప్రభుత్వానికి తీవ్రమయిన పోరాటం జరిగింది. సత్యాగ్రహం మొదలగు నవి జరుగ ప్రారంభమైనది. బజాజ్ గారు మధ్యవర్తిత్వం వహించారు. ఈ తగాదా సమయంలో

600 పైగా అరెస్టు అయినారు సికార్‌లో జయపూర్ సైన్యము లేకుండా జయపూర్ పోవాలెనన్నారు ప్రజలు. చివరకు అనేక నిర్బంధాలు జరిగిన తర్వాత ప్రభుత్వంవారు అంగీకరించారు. నిర్బంధితులందరిని వదిలేశారు. 10 మందిని మాత్రం వదలలేదు. రాజ్యంలో కరువు ప్రారంభమైనది. ప్రజలు కరువుచేత చెప్పనలవిగాని బాధలు పడుచున్నారు. ప్రజాపరిషత్తు ద్వారా బాధితులకు సహాయము చేయడానికి బజాజ్ జయపూర్ వెళ్ళితే మొదట నిషేధాజ్ఞ యిచ్చారు. తర్వాత అరెస్టు చేసి ఎటో త్రిప్పి త్రిప్పి ఆగ్రా చేర్చారు. ఈ విధంగా రెండు మార్లు అరెస్టు చేసి వదిలేశారు. ఇపుడు నిర్బంధించారు. అది పెద్ద రాజకీయ సమస్య అయ్యింది. అంటే ప్రజలు కరువుతో బాధపడుతుంటే ప్రభుత్వం సహాయము చేయదు గదా, మరెవరూ సహాయము చేయకూడదూ? పైగా తమలో తాముకూడా సహాయం చేసికో కూడదు. చేయుదలచుకున్నవారడుగు పెట్టకూడదు! 1939 మార్చి 2 న వైస్రాయి లిన్‌లిత్‌గో విందులు గుడవ వచ్చాడు. పరిపాలనలో ప్రజలకు అవకాశం ఇవ్వాలిసొస్తుంది అంటూ అంటీ అంటని కబుర్లు చెప్పాడు. ఏమి నిరంకుశచర్యలు! నేడిచట సత్యాగ్రహ సమరం తీవ్రస్వరూపంలో జరుగుచున్నది. ఆడవారినిగూడా అరెస్టు చేశారు.

## సికారు

(ఇది జయపూర్ సంస్థానములోని ఒక ఠికానా (ప్రాంతము) 7 లక్షల ఆదా వస్తుంది. ఇట వ్యవసాయదారుల జనాభాలో 80 వేలలో 60 వేలు జాఠ్ జాతి ప్రజలు)

పన్నులు వసూలుచేయు దలంచి సౌమ్యంగాయిచ్చే స్థితిలో లేరంటే - ప్రజలు యివ్వజాలిన మొత్తములుగ నుండకపోవుట, ఇవ్వవలసిన అవసరం లేకపోవుట వలనన్నమాట - సంస్థానాధిపతి తనబలంఅంతా ఉపయోగించి వసూలు చేయవలసిన వాడాయెను. అట్లు వసూలు చేయుటలో ఉపయోగించిన సాధనలు (1) హత్యలు, (2) తుపాకీ కాల్పులు (3) లాఠీచార్జీలు, (4) పాఠశాలల పడగొట్టుట, మూసివేయుట; (5) ఇండ్లను పైబడి దోచుకొనుట, ఆస్థిని నష్టపరచుట, (6) చెల్లించవలసిన దానికన్న సిస్తులను, తీరువాలను ఎక్కువ రా బట్టుట, (7) జరిమానాలు, సైనిక ఖర్చులు అంటూ డబ్బు వసూలుచేయుట, (8) స్త్రీలను మానభంగ మొనర్చుట, (9) జాత్ (శ్రమిక) జాతి వారికి సహాయం చేసిన వారిని వెడలగొట్టుట (10) జాత్ జాతివారిని హింసించే రాజపుత్రులకు ప్రోత్సాహమిచ్చుట, (11) జాత్ జాతివారు గుర్రము, ఒంటె ఎక్కరాదనియు, దేవాలయముల లోని రాకూడదనియు అభ్యంతరపెట్టుట. (12)

జాత్ జాతివారి అర్జీలుతీసికోవద్దని పోలీసువారికి కోర్టులకు హుకుంజారీచేయుట! ఈవిధంగా వున్న ప్రభుత్వాన్ని ఏమనాలో, ఈ ఇరువదవ శదాబ్దపు నాగరికతలో ఇది అభివృద్ధిఅని తలంచవలెను కాబోలు. ప్రజలలో ఆవేదనపెచ్చు పెరిగి పోయింది, స్వాతంత్ర్యకాంక్ష బయనుదేరింది. జాత్ జాతివారధికులు ఆందోళన సాగించుతున్నారు కావున, నిర్బంధాలు వారిమీదనే వున్నవి గావున దీనిని జాత్ సత్యాగ్రహమన్నారు. సంఘాలుగా యేర్పడుతున్నారు. త్వరలో ఇక్కడకూడా తీవ్ర ఆందోళన బయలుదేరుతున్నది.

## కాశీ

వై. 875 చ. మై. జ నా భా 3 91 272 ఆదా
ర 18 22 180 సాల్యూట్సు 13 కప్పం రు. 2 19 000
ఫై. ఎ. 1 ఫై. కా 1

ఇది 25 సంవత్సరాల క్రితం జమీందారీ. తర్వాత సంస్థానం అయింది. ఎన్నోసంవత్సరాల నుండి రాజకీయ సంస్కరణలు కావాలెనంటూ ప్రజలు అందోళన సాగిస్తూవున్నారు. స్టేటుకాంగ్రెసు ప్రారంభింపబడెను. ప్రజలు రాజకీయప్రచారమున్నూ, ఆర్థిక బాధానివారణాన్ని కోరుచుచున్నారు. ప్రచారం తలపెట్టినారు. ప్రచార సందర్భంలో రామానంద్

అను నతనిని అరెస్టుజేసిరి. 1938 మార్చిలో ప్రభుత్వం ఒక కమిటీని వేసి వారిరిపోర్టుపై కొన్ని అధికారాలు ప్రజలవశం చేశామంటూ నామ కార్థంగా ప్రకటించిరి. అందుపై ప్రజలు రామానందుని వదలవలసినదనియు, ప్రభుత్వం యిచ్చిన సంస్కరణల కన్నను విశాలమగు సంస్కరణములు కావలెననియు, తీర్మానించిరి. 20,000 ప్రజలు ఛాకియాలో ఫారెస్టు సత్యాగ్రహం (28-12-38) న జరుపుటకు నిశ్చయించి సమావేశమైరి. సత్యాగ్రహం ప్రారంభించేలోగా రాజాసాహెబు అచటికి వచ్చి త్వరలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సంస్థానంలో ప్రవేశపెట్టుచు ప్రకటన చేస్తానని అందాకా ఆగవలసినదని కోరెను. ఎన్నుకోబడిన వారి చేతులలో అధికారాలు ఉంచుతాననెను. రామానందుని విడుదల చేశానన్నాడు. అప్పటికి ప్రజలు సత్యాగ్రహం ఆపిరి. మరల ప్రజలు సత్యాగ్రహం సాగించవలెనని తలంచిరి. పండితజవహర్‌లాల్‌నెహ్రూగారు జోక్యం కలిగించుకొని ఆగవలసిందనిరి. ఇపుడు (13-2-39) న సచ్చిదానంద సిన్‌హాగారి అధ్యక్షతను ఒక ఉపసంఘము యేర్పాటుచేయుచు ప్రకటనిచ్చిరి. ప్రజల కోర్కెమేర 3-3-39 న కొంతసిస్తు రిమిషనిచ్చాడు. అసెంబ్లీ ఎర్పాటు అందు ప్రజల ప్రాతినిధ్యం, ప్రశ్నల విధానం, మంత్రివర్గనిర్మాణం, వారివిధులు,

సంస్థానార్థికాభివృద్ధియు అవకాశములు వీరు విచారించాలె. వీరు మార్చిలో సమావేశం కావాలె. ప్రజలలో మంచిచైతన్యం కలిగింది.

## రాంపూర్

వై. 892 చ. మైళ్ళు. జనాభా 4,64,949 ఆదాయ రు 49,17,028. ఫై 1.. ఎ. ఫై, కా. 1.

ఈ రాంపూర్ అనేవి మూడున్నవి. ఇది సంయుక్త రాష్ట్రములోనిది. ఇచట ప్రజలలోకొంత ఆందోళన జరిగినది. రాజకీయ హక్కులకై బాధ్యతాయుత పరిపాలనకై ప్రజలు ఆందోళన సాగించారు. సిస్తులు తగ్గించమని కోరిరి. ఈ సంస్థానానికి ఎసెంబ్లీ ఒకటి కలదు. ఇందు 9 మంది ఉద్యోగీయులు. 6 గురు అనుద్యోగులు కలరు. అంతా ప్రభుత్వం చేత నియమింపబడినవారే. దానిగడువు 1938 తో అంతమైనను దానిని 1939 నవంబరు 15 వ తేదీ వరకు హెచ్చించిరి. ఈలోగా రాజకీయ సంస్కారణాలు ప్రకటిస్తానన్నారు. ఇంతవరకు కిస్తీలో రు 3,81,000 లు మాఫుచేశారు. రు 74 వేలు వసూలు ఆపుచేశారు. ఒక లక్షరూపాయీలు విత్తనాలకు, వ్యవసాయపనిముట్లకు యిచ్చి కొందరు ఉద్యోగులకు పనికల్పించారు. ఈసంవత్సరం అగ్గిపెట్టె ఫ్యాక్టరీలు, పెంకు ఫ్యాక్టరీలు, రెండు స్థాపిం

చారు. ఈఫ్యాక్టరీలలో పనిచేయడానికి 200 మంది యువకులను ట్రైనింగుకు పంపారు. ఇదిగాక రు 1,50 వేలు ఇతర పరిశ్రమలకొరకు మంజూరు చేశారు. రు 15,000 లు పారిశ్రామికులకు అప్పుల క్రింద ఇచ్చారు. ఒక రాజభవనం బాలికాపాఠశాల కిచ్చారు. ఈతకు కోనేళ్లు, గోదాలు ఆటస్థలాలు నెలకొల్పారు. స్టేటు హైస్కూలును అభివృద్ధి పరిచారు. ఈపనులన్నీ ప్రజలకండ్లనీరు తుడుచుటకును మధ్యతరగతివారిలో సంతృప్తి కలిగించుటకును చేసినవో లేక నిజంగా ప్రజాభివృద్ధినే అభిలషించారో అనేవిషయం వారిచ్చే రాజకీయ సంస్కరణములనుబట్టి ఉంటుంది. రాజకీయ సంస్కరణాలు ప్రజలకు సంతృప్తి కరంగా లేకపోతే తీవ్ర ఉద్యమం సాగించడానికి తయారై వున్నారు.

## ఆర్ఛా (తికమ్ఘర్)

వై. 2080 చ. మై. జ నా భా 3 14 661 ఆదా రు 13 14 000 సాల్యూట్సు 15. ఫై. ఎ 1 ఫై. కా 1/2

ఈ సంస్థానం సంయుక్తరాష్ట్రాల మధ్యనున్నది. ఇందు రెండు మూడు భాగాలుగా వుంది. ఒక భాగంనుండి మరొక భాగంలోనికి పోవాలెనన్నా సంయుక్తరాష్ట్రాల అధీనంలో వున్న గ్రామాల గుండా పోవాలె. ఈ సంస్థానంలోని ప్రజలకు అచటి

అధికారులుకన్నులివ్వలేదని తమమాటలు వినలేదని అదిరించడం బెదిరించడం అలవాటై పోయింది. ప్రజలు ధిక్కారంచేసే స్థితిలో లేకఅటులనే బాధ పడుచూ నుండిరి. ఈ ఆసరాచూచుకొని తాము నడిచే భూభాగమంతా వారిదే ననితలంచి 1939 ఫిబ్రవరిలో తమ ప్రాంతములోనికి ఒక భాగంనుండి మరొకభాగానికి పోవుచు సంస్థాన పోలీసులు దారిలోని సంయుక్తరాష్ట్రిలలోని గ్రామ ప్రజలపై తుపాకులు కాల్చడం సాగించారు. ఇట కాంగ్రెస్ మంత్రివర్గం ఉన్నది. వారీ విషయం సంజాయిషీ తీసికొంటున్నారు. ఇక ఈ విధంగా ఏసంస్థాన పోలీసు సిబ్బంది అయినను వెళ్లేటప్పుడు వారిచే తులలో నున్నఆయుధాలను అన్నింటిని రాష్ట్రప్రభుత్వము స్వాధీనపరచుకొనుటకు ఆలోచనలు చేస్తున్నారు. ఆ ఏమి సంస్థాన పోలీసువారి ధీమాసా, కాంగెస్ మంత్రివర్గంలో నున్నప్రదేశాలు కూడా తాము నడచినంత మాత్రాన తమవేనని తలుస్తున్నారు.దీనిని బట్టి సంస్థానంలో ప్రజలను ఎంత బాధపెట్టుచున్నారో మనమూహించుకోవచ్చును.

## బోహావాల్

వై. 257 చ. మైళ్లు. జనాభా 42,192 ఆదాయ 1,25,000

ఇది మధ్యఇండియాలోని బుందేల్ ఖండ్ ఏజన్సీలోని

సంస్థానము. ప్రజలు పన్నులబాధ భరింపలేకుండా వున్నారు. రైతుల సిస్తులో చాలాభాగం తగ్గించ వలెనంటూ ప్రజలు తీవ్రాందోళన లేవనెత్తారు. పన్నుల నిరాకరణ ప్రారంభించారు. ప్రజల ఆందో ళనను ఏవిధంగా ఎదుర్కొనడమా అని సంస్థా నాధిపతి ఆలోచించాడు. దేశంలోని పరిస్థితులు గమనించాడు. తనప్రజల తీవ్రత గ్రహించాడు. చివ రకు రూపాయకు మూడు అణాలవంతున సిస్తు రిమి షన్ ప్రకటించాడు! 'కొన్నిపన్నులు సిస్తులు రద్దు చేశారు. రైతులకు సంతృప్తి కలుగలేదు. వారు సిస్తుల నిరాకరణమును వెనుకటికంటె ఎక్కువ తీవ్రంగా కొనసాగిస్తున్నారు!' అని సంస్థానపు దివానే ప్రకటించాడు. అందుపై సంస్థానాధిపతియే ప్రజలతో మరల సంప్రదించి మరొక అణా తగ్గిం చాడు. సంస్థానప్రజలు తమకు బాధ్యతాయుత పరి పాలన యివ్వవలెనంటూ, సిస్తు యింకా తగ్గించవలె నంటూ ఆందోళన సాగిస్తున్నారు. పొరుగునవున్న బాగల్ ఖండ్ సంస్థానము యేయేసంస్కరణలు- అధి కారాలు ప్రజలకు యిస్తారో అట్టి బాధ్యతాయుత పరిపాలననే యిస్తానంటూ వంతుపెట్టుకున్నాడు. ఈ పోటీలకు, వంతులకు ప్రజలకేమి ప్రసక్తి. ఈ కబుర్లకు లొంగక ప్రజలు సంపూర్ణ బాధ్యతా

బాధ్యత ప్రభుత్వం తమకిచ్చితీరాలంటూ తీవ్రతర మగు ఆందోళన సాగిస్తున్నారు.

## జోధ్ పూర్ (మార్వార్)

వై. 33 021 చ. మై. జనాభా 21 25 982 ఆదా రు 1 46 01 000 కప్పం రు2 18 000లు సాల్యూట్సు 17 ఫై. ఎ. 2 ఫై. శా. 2 స్థానాలు.

ఇది పశ్చిమరాజపుత్రస్థానం ఏజన్సీలోని సంస్థానము. ఇందుచాలా చిన్నజాగీరులుకలవు. ఇదిచాలాపురాతన పు మేవార్ రాజులకు చెందిన వీరవంశము. ఈ సంస్థానాధిపతి సిపాయీ తిరుగుబాటులో ఇంగ్లీషువారికి సహాయంచేసి ఆనాటి వీరకీర్తికి కళంకం తెచ్చుకున్నాడు. దేశంలో భిల్లులు వగైరా బీదజాతులు జాస్తి. ప్రజలలో పన్నులభారం కృంగతీయుచున్నది. ప్రజల కేపాటి అధికారములు లేవు. ప్రాథమిక హక్కులులేవు. తిన్నని గామెల్లగా ప్రజలు ఆందోళన చేయసాగిరి. లాభంలేకపోయెను. గొప్ప అలజడి బయలు దేరదీసిరి. సంస్థానాధిపతి గుర్తించి, ముందు వెనుకలు ఆలోచించిక పోయిన లాభం లేదని తలంచెను. అందుపై సంస్థానాధిపతి గ్రామాలలో పంచాయతీలు స్థాపించుచును, కేంద్రశాసన సభనిర్మాణంచేయుచును, ప్రకటనచేశారు ఆపంచాయతీలలో శాసనసభలలో ప్రాతినిధ్యము తేలలేదు.

సంస్థాన ప్రజాసేవాతురుడైన శ్రీజయనారాయణ వ్యాస్ బోటిదేశసేవకులను సంస్థానము నుండి వెడల నడిపిరి. ఇది ప్రజలలో తీవ్రసంచలనం కలిగించింది. ప్రజలలో ఆందోళన సాగింది. ఇంతలో మరల సంస్థానాధిపతి గ్రామపంచాతీలు జిల్లాబోర్డులు కేంద్రసలహా సంఘమును ప్రవేశపెడుతూ నొక ప్రకటన జారీచేసెను. ప్రజలువాని విధానం చూచి సంతృప్తికరంగా బాధ్యతాయుత పరిపాలన అమలు జరుపునవిగ నుండిన సరే, లేకున్న తీవ్ర ఉద్యమం లేవదీయుటకు సన్నాహములు యేర్పరచుచున్నారు.

## కూచిబిహార్

వై 1318 చ. మై. జనాభా 5,90,866. ఆదా రు 25,05,984, కప్పం రు 67,7000. సాల్యూట్సు 13, ఫే. ఎ. 1. ఫె. కౌ. 1 స్థానం

ఇది బెంగాల్ రాష్ట్రములోని సంస్థానము. ఇచట చాలాకాలమువరకు రీజంటు మహారాణి పాలన సాగెను. ఈనడుమ మైనరు పెద్దయై గద్దెనెక్కెను. ఇచట ప్రజలు మలేరియావల్లను, పన్నులబాధ వల్లను అణగారి పోవుచున్నారు. పన్నులు తగ్గించవలెనని తీవ్రంగా ప్రచారం సాగించిరి. బాధ్యతాయుత పరిపాలన కావలెనంటూ ఉద్యమం సాగించిరి. దీనిని సంస్థానాధిపతి గమనించెను. 1909 లో

పూర్వపు సంస్థానాధిపతి ఒకశాసనసభను నిర్మిం చెను. స్వప్రయోజన పరులను, ప్రజాపీడకులకు జెందినవారిని ఇందు సభ్యులుగ సంస్థానాధిపతియే నామినేటు చేయుచుండెను. బ్రిటిషు ఇండియాలో అమలు చేయుచున్న శాసనాలను ఈశాసనసభ అచ్చునకుమచ్చు అమలుపరచుచుండెను. 1938 లో 3 సబ్ డివిజనులనుండి అధికారేతర సభ్యులు ఎన్నుకోబడుట కేర్పాటు చేసిరి. ఎన్నికలు సీలు చేయబడిన కవర్ల ద్వారా జరుగుట కేర్పాటు చేసిరి. అంటే వోటర్లు చాలా తక్కువ మందిగ ఉండిరి. సంస్థానాధిపతి తన మంత్రివర్గంలో ఎన్ను కోబడిన సభ్యులనుండి ఒకమంత్రిని నియమించెను. ఇత డెవరికి బాధ్యుడో తెలియుటలేదు. ఈ నిర్ణయ ప్రకారంయిచ్చిన ద్వంద పరిపాలనలో ఈఎన్నుకోబడ్డ మంత్రివిద్య వ్యవసాయము పరిశ్రమలు రిజిస్ట్రేషను కోర్టుఆఫ్‌వార్డ్సు స్టేషనరీ శాఖలపై అజమాయిషీ చేయు అధికారమిచ్చిరి. 1939 మార్చి 1 వ తేదీ శ్రీసుశీలకుమార్ చక్రవర్తిగారిని మంత్రిగ నియ చిరి. బాధ్యతాయుత పరిపాలన కాదుకదా! అందలి సారాంశమన్నాలేదు. ప్రజలలో అసంతృప్తి కలిగియే యున్నది. ఇకను కొన్ని సంస్కరణములు త్వరలో ప్రవేశపెట్టనిచో తీవ్ర తరమగు ఆందోళన సాగించు టకు ప్రయత్నములు సాగుచున్నవి.

(౧౨) తేగా

## త్రిపుర

వై. 4119 చ. మై జ నా భా 3 82 450 ఆదా
రు 23 08 317 సాల్యూట్సు 18 ఫె ఎ. 1 ఫె.కా. 1/2
ఇది బెంగాలులోనిది ఇట జనపనార ఉత్పత్తి అధి కం. ప్రజలు పన్నులు తగ్గించవలెనని బాధ్యతా యుత పరిపాలన కావలెనని ఆందోళన సాగించు చున్నారు. అందుపై గ్రామమండలి (పంచాయితీలు మాదిరివి) మచ్చుకు మూడుతాలూకాలలో నిర్మా ణముచేయుచు 1939 ఫిబ్రవరి 28 న ప్రకటించెను. ఈ మండలులలో ప్రజలెన్నుకొన్న సర్దారు ఎన్నికో బడుదురు. ఈమండలులకు (అనందంగా ?) పన్నులు వసూలుచేసికొనుట గ్రామపారిశుధ్యం, రోడ్ల మర మ్మతు విద్యాభోధ చిన్నచిన్న క్రిమినల్ సివిల్ కేసులు విచారణ అధికారాలు యివ్వబడెను. ఇదియొక నాటకము. దీనివలన ప్రజలకు లభించిన లాభం కాన్పించదు. అదనంగా పన్నులు వసూలుచేసి అధికారాలు నిర్వహించవలసినదే. ప్రజలలో దీని వలన కొంతప్రబోధంఅసంతృప్తి రెండూ కలుగుటకు కారణమైనది.ప్రజలలో ఆందోళనసాగించుచున్నారు.

## ఢెంకనల్

వై. 1463 జనాభా 284 326 ఆదా రు 4 52 000
ఫె. ఎ. 1/8 ఫె. కా 1/5. స్థానాలు.
ప్రజాఉద్యమ ప్రాతిపదికమగు సభలు జరుపుటను

ప్రభుత్వం వలదనడంతో ప్రారంభమైనది. సంస్థానంలో బేగార్ (నిర్బంధ సేవాపద్ధతి) ఉన్నది. అది పోవాలె నన్నారు. అందుపై అరెస్టులు ప్రారంభమైనవి. యువకులు యువజనసంఘాలు లేవదీశారు. సభలుచేశారు పోలీసులు కాల్చారు. 7 పర్యాయములు కాల్చారు. మిలిటరీని బయటినుండి తెప్పించారు. కాల్పులవల్ల ప్రజలలో అసంతృప్తి, ప్రభుత్వమును ఎదుర్కొవాలె ననే కుతూహలం బయలుదేరింది. సభలుచేస్తే వేలకువేలు ప్రజలు గ్రామాలనుండి రా మొదలుపెట్టారు. ప్రజా ఉద్యమంగా మారింది. ఇటు ప్రజలను తీవ్ర నిర్బంధాలకు గురిచేస్తు, అటు ప్రభువే గ్రామాల్లోకి పోయి అని అధికారాలు ప్రజల వశంచేశామంటూ ప్రజలను సభలు జేసి చెప్పనారంభించారు. అసాధారణ గజెట్‌లో [illegible] ఆ [illegible]లు ఈ హక్కులు అని ఇచ్చినట్లు ప్రకటించారు. కాని ఒక్కటి అమలుకు రాలేదు అంతటితో ప్రజలకుకూడా ఈ కుయుక్తి బోధపడింది. 1938 ఆగస్టు 18 వ తేది వివిధ గ్రామాలలోని 5 మంది కొకరువంతున 5000 ప్రజలు సంస్థాన దర్బారు వద్దకువచ్చి ప్రజల కష్టాలు తెలుపుకుంటే రాజా ఎదోఒక ఉపన్యాసం యిచ్చాడు లాభంలేదని ప్రజలు వెళ్ళిపోయారు. తీవ్రమగు ప్రచారంచేశారు. ఊరేగింపులు, సభలునిషేధించారు. లాఠీచార్జీలు, కాల్పులు మితిమీరనవి. లాఠీలు,

తుపాకిగుండ్లు వర్షం కురిసినవి. ఒకరిద్దరు అక్కడే మరణించారు. 50 వేల ప్రజలు మైదానంలో కూర్చు న్నారు. కోటను ముట్టడిస్తామనిరి. రాజు హడలెత్తాడు తంతీలపై తంతీలు పంపి శ్రీకృష్ణమెహతాబ్‌ను పిలిపించుకున్నాడు. శ్రీకృష్ణమెహతాబ్ ప్రజలను శాంతపరచి పంపాడు. పోలీసులు, మిలిటరీ ఊళ్ళలో పడి ప్రజల ఆస్తి అపహరించుచు, ఇండ్లలో దూరి అమాయకులను చావమోదారు. స్త్రీలను అల్లరి చేసి చక్కాబోయారు. ప్రజాక్షేమం లేదు. ప్రాణ రక్షణ లేదు. ప్రజలలో ప్రభుత్వంపై తీవ్రముగు ద్వేషాలనము ప్రబలింది. ఏమైనాసరే పోరుసాగించ వలసినదే అనే ధైర్యం ప్రజలలో వచ్చినది. యువ కులు రణరంగంలో దూకారు. కాంగ్రెస్ వారు దెబ్బలు తిన్నవారికి సహాయంచేయ మొదలుపెట్టారు. ఈ హత్యలు భరించలేక కొందరు బ్రిటిషు ప్రాంతాల్లోకి వెళ్ళారు. వారికి కావలసిన సహాయం కాంగ్రెస్ (ఒరిస్సా) మంత్రివర్గం చేయనిచ్చిరి. ఇండియా ప్రభు త్వం వల్ల కాదంటే తాము ప్రజాప్రతినిధుల మన్నారు. బయటివారు పాల్గొన వద్దని గాంధీగారు సలహా యిచ్చారు. ఇది ఢెంకనల్ తగాదా కాదు. తూర్పుతీరాన బ్రిటిషుసామ్రాజ్యవాదుల కోరలు పీకడానికి ఈ ఢెంకనల్ కేంద్రం కావలసిందే!

## నయఘర్

వై. 588. జనాభా 1,42,406. ఆదా రు 3,89 వేలు. కప్పం రు 5525. ఫై. ఎ. 3/8 ఫై. కా. 1/5.

ఇది చిన్న సంస్థానమే. దీనిపంథా మరొకటి. ఈ సంస్థానంలో ప్రజలు తమలపాకులు ఎక్కువ వాడు తారు. ఈ సంస్థానాధిపతి తనసంస్థానంలో తమల పాకులు అమ్మడం తన అభిమానికి గుత్తకిచ్చాడు. ఇంకెవరూ ఆకులు అమ్మకూడదు, అతడు ఎంత ధర చెప్పినా కొనితీరవలసిందే. ప్రక్క బ్రిటీషు ఇండియాలో గ్రామాల్లో అమ్మే ధరకన్నా 4 రెట్లు ఎక్కువచేశాడు. మన రైతులు పొగాకు మానడం ఎంతకష్టమో అక్కడి రైతులకు తమల పాకులు మానడం అంతకష్టం. ప్రజలు భరించలేక పోతున్నారు. ఈధరవల్ల చివరకు గత్యంతరం కన్పించక మాన నిశ్చయించారు. తమలపాకుల బహిష్కరణ ఉద్యమం ప్రారంభించారు. సంస్థానాధి పతికి భయం కలిగింది. బహిష్కార వారం సాగించారు. 1938 ఏప్రిల్ 6 వ తేదీ జాతీయవారం ప్రారంభం. ఆనాడు అరెస్టులు కూడా సంస్థానాధిపతులు ప్రారంభించారు. అరెస్టులతో ఆందోళన బాగా ప్రచారం అయింది. బహిష్కారం మరీ బలపడ్డది. రోజూ అమ్మకం రు 300 ల నుండి రు 3 కు దిగింది. అరెస్టులు గ్రామాల్లో తెలియగానే

ప్రజలు ఊరేగింపులు ప్రారంభించి కేంద్రానికి వచ్చారు. అధికారులు దారులన్ని అరికట్టారు. తప్పుకొని ప్రజలు ఇంకా విరివిగావచ్చి ఉత్సవంలో పాల్గొన్నారు. ప్రజలలో ఒక్కుమ్మడి ఉత్సాహం పెచ్చరిల్లింది, ఉబికిపోయింది. సత్యాగ్రహం సాగుతూన్నది.

## హిందోల్

వై. 312. చ. మైళ్ళు. జనాభా 48,896, ఆదా రు 1,11,000. కప్పం రు 551

ఇది ఒరిస్సా సంస్థానములలోనిది. ప్రజలు వెట్టి చాకిరి, బసద్ (?) పద్ధతి, మేగన్ (అంటే ... కోత్స వముల సందర్భములో ప్రజలిచ్చుకోవలసిన ... నజరానాలు) తీసివేయవలసినదని కో... పౌరసత్వహక్కులు కావలెనని. బాధ్యతా యుత పరిపాలన కావలెనని చాటిరి. వ్యవసా... పని ముట్లకును, వంటచెరుకునకును, ఇండ్లకును సంస్థానపు అడవిలోనుండి ప్రత్యేక రుసుములు చెల్లింపవలసిన పనిలేకుండ తెచ్చుకునేహక్కు ప్రజలకివ్వ వలసినదిగను కోరిరి. ప్రజలు కొంత ఆందోళన చేయగా సంస్థానాధిపతి విధిలేక ప్రజావాంఛను గౌరవించి వారి కోరికలలో కొన్నింటిని నెర వేర్చెను. కిరసనాయిల్, ఉప్పుమీద పన్నును రద్దు

చేయుచు ప్రకటన గావించెను. మరియు అడవికి సంబంధించిన వివిధ శాసనాలను గురించియు, అడవి ఫలసాయము పెట్టి యున్నగు పన్నుల గురించియు పున రాలోచించుట కంగీకరించెను ప్రజాప్రతినిధి సభ (ప్రాతినిధ్య సెంట్రల్ ఎసెంబ్లీ) 1939 ఏప్రిల్ 1 వ తేదీని అమలు చేయునట్లును, అసభలో సగం సభ్యులు ప్రభుత్వ నియోజితులుగను, మిగత సగం ప్రజలచే ఎన్నుకోబడువారుగను ఉండునట్లును, అధ్యక్షుని ప్రభుత్వమే నియమించునట్లుగను, ప్రతినిధుల గడువు 3 సంవత్సరము లుండునట్లును, దౌర్జన్యం, మతకక్షు వాదం మినహా వాక్స్వాతంత్ర్య మిచ్చునట్లును 1938 జనవరిలో ప్రకటన జారీచేసెను. వోటు అధి కారమేమియో, సభ్యులసంఖ్య యెంతయో తెలుప లేదు. సభలోకి హరిజన ప్రవేశంకూడావుంది అన్నారు. ఇంకా అసలునివేదిక వివరంగా వచ్చే టందుకై ప్రజలెదురుచూచుచున్నారు. సంస్కర ణల ప్రణాళిక ప్రజలకుతృప్తికరంగా వుండనిచో మరల తీవ్రోద్యమం సాగింప దలచియేయున్నారు.

## రాన్‌పూర్

వై. 203 చ.మై. జనాభా 47 711 ఆదా రు 65 000
కప్పం రు 1401

ఓరిస్సా సంస్థానాలలోనిది. సంస్థాన ప్రభువుల నిరం



కుశత్వం మితిమీరింది. ప్రజలు తమకడ గండ్లు ప్రభువులతోను, పొలిటికల్ ఏజంటుతోను అనేక మారులు మొరపెట్టుకొనిరి. వీరి కష్టాలను విచారించడానికి ఓరిస్సాసంస్థాన ప్రజామండలి ఒక ఉపసంఘాన్ని వేసింది. దానిముందు వందమంది సంస్థాన ప్రజలు సాక్ష్యంయిచ్చారు. రాన్‌పూర్ సంస్థానంలో ఇంటికి రెండు తలుపులు పెట్టుకోకూడదు. మంచి గుడ్డలు కట్టుకోకూడదు. అలంకరించుకొని వీధిలోనికి రాకూడదు. కొందరు తప్ప అందరూ పల్లకి నెక్కకూడదు. పెళ్ళికి మొగపెండ్లివారు ఆడపెండ్లివారు చెరొక రూపాయి పన్ను చెల్లించాలె. పల్లకీ ఊరేగించడానికి రు 15 లు పన్ను చెల్లించాలె. యువరాజాగారికి ఉపనయనానికి, రాజమాతమరణానికి రూపాయికి 4 అణాలువంతున పన్ను చెల్లించాలె. అదనంగా ఇంటికి అర్థణా వంతున వసూలు చేసి ఒరియా ఉగాదికి రాజుగారికి నజనారా చెల్లించవలెను.

ఇక్కడ వెట్టిచాకిరి బాగా బలిసిపోయింది. 27 రకాలుగా పరిణామం చెందింది. పర్వదినంనాడు దేవుడి పేరుతో కులాసాగా వేటకు రాజుగారు వెళ్లుతున్నారు అంటే ఎన్నాళ్లు వేటకువెళ్ళితే అన్నాళ్లు వెట్టికి ప్రజలుపోవలసిందే! వేట స్థలంకు చుట్టు కంచె వేసి కాపాడడం, రోడ్లుమరమ్మతు చేయుడం, అధి

కారుల సామానులు మోయడం, రాజుగారెవరి కిమ్మంటే అన్నాళ్లు ఇండ్లువదలి వేయడం, జరుపవలసి నదే! వీనిని చేయు లేదని జరిమానాలు, వ్యవసాయపు రోజుల్లో పనులవల్ల ఎవరన్నా రాకపోతే దెబ్బలే, గతి. జరిమానా వసూలు చేసినట్లు రసీదు లేదు. పోలీసు వారి పుస్తకాలలోనన్నా ఈతని సంతకము లేదు. పొలిటికల్ ఏజంటు క్యాంపుకువస్తే వారికి వెన్న, పెరుగు కోసరం 50 లేక 60 ఆవులు తోల వలసిందే. కోళ్ళు మేకలు ఆహారానికి యివ్వవల సిందే? పూర్వంఅంటే 15 సంవత్సరాల క్రితం అడవి లోని పుల్లా పుట్రా తెచ్చుకోవడానికి పన్ను లేనే లేదు. ఇపుడు బండికి 12 అణాలు యివ్వాలె. ఈ సంగతి పత్రికల్లో వ్రాస్తే అనుమానంమీద ఒకన్ని అరెస్టుచేశారు. నానాహింసలు పెట్టారు. కోర్టుజడ్జిమెంటు నకలడిగితే ఆతన్ని జైలులో వేశారు. ఇదేమి గతియని పొలిటికల్ ఏజంటుకు చెప్పుకుంటే తనపని కాదన్నాడు నలుగురు కలుస్తే మహాపరాధం. ఈవిధంగా 20సంవత్సరాలు బాధలుఅనుభవించారు పొలిటికల్ ఏజంటుగనున్న బిజెల్ గెట్జికి అనేక మారులు తెలియపరచుకున్నారు. ఊరూర సభలు జరిపారు. దర్బారుకు రాయబారాలు నడిపారు. ఇది సహించలేక దర్బారువారు 1938 డిసెంబరు 27 వ తేదీన పత్రికలను నిషేధించామంటూ ప్రకటన

ఒకటి చేశారు. సభలు జరుపుటకు దర్బార్ అనుమతి కావాలెనన్నారు. ప్రజామండలి అక్రమసంఘమన్నారు. వెంటనే పోలీసులను రప్పించారు. 1939 జనవరి 4 వ తేదీ పలువురును అరెస్టు చేశారు అరెస్టు చేసిన వారిని విడుదల చేయవలెనంటూ 5 వ తేదీ ప్రజలుదర్బార్ కోటవద్దకు వెళ్ళినారు. ఆసందర్భాన ఏమి జోక్యంలేని బ్రిటిషు ఏజంటు బిజల్ గట్ ప్రజలలోపడి తుపాకీ కాల్చాడు 19 మంది మరణించారు. జనంలో ఉద్రేకం ప్రజ్వరిల్లి పోయింది. నెట్టుకొన్నారు. తోసుకున్నారు. ఈ వత్తిడిలో నడుమయిరుక్కొని పోయిన, చేతిలో గుండ్లు అయిపోయిన బిజల్ గట్ ఆవత్తిడికి చని పోయినాడు. దానిపై క్రిందినుంచీ పైవరకు బ్రిటిషు ప్రభుత్వం ఇటు సంస్థాన ప్రభుత్వము తమ బలమంతా ఉపయోగించి ఊరూరు వెళ్ళి ప్రజలను హడలుగొట్టి తీవ్ర నిర్బంధచర్యలో ప్రజాఉద్యమాన్ని అణచడానికి ప్రజలను హింసించుచున్నారు. మిలిటరీని రెండు పటాలములను రాన్ పురా చేర్చారు. ప్రజలు భయపడి ప్రక్కనున్న ఒరిస్సా రాష్ట్రంచేరారు. ప్రజలు అరిచేతులల్లో ప్రాణాలు పెట్టుకొని క్షేమం అనేమాట రక్షణ అనేమాట లేక పరితపించి పోవుచున్నారు. ఏ నిమిషములో ఏమి జరుగనున్నదో?

## తాల్చేరి

వై. 399 చ. మైళ్లు. జనాభా 24,822. ఆదా
రు 2,78. వేలు. కప్పం రు 1040. ఫి. ఎ. 3/8.
ఫి, కా. 1/6. స్థానంకలదు.

రైతులయిక్కట్లు లాలోచించేవారు గాన్పించలే
దని మొత్తుకున్నారు. మాస్థితిగతులు పరికించండో
యన్నారుప్రజలు. రాజకీయస్వాతంత్రం అంటే పౌర
సత్వ హక్కులు యివ్వమన్నారు. సంస్థానాధిప
తులు వల్లగాదన్నారు. ప్రజలు తమవాంఛను వెలి
బుచ్చారనే కోపంతో తీవ్రనిర్బంధాలు ప్రయో
గించారు. బయటిసహాయంతో సంస్థానాధిపతి ప్రజ
లను హింసించ మొదలుపెట్టాడు. భరించలేక
పోయినారు. అరెస్టులు, ఆస్తిజప్తులు, మితిమీరినవి,
ప్రజల పంటలు జరిమానాలక్రింద జప్తుచేశారు.
1938 డిసెంబరు 16 న లక్ష్మీధరదాసు మొద
లగు చాలమందిని అరెస్టు చేశారు. గ్రామాలలో
దూరి ప్రజలను హింసింప మొదలు పెట్టారు.
పంటలన్నిటిని జప్తుచేశారు. అమాయకులగు
ప్రజలు ఈ హింసలు భరింపలేక బ్రతికియుంటే
బలుసాకైనా తినవచ్చునని ఒరిస్సా రాష్ట్రంలో
అంగుల్ ప్రాంతాలకు చేరారు. అక్కడికిపోయినా
ఈ అధికారులు వారిని బాధించవలెనని తలంచి
వారిని తమకు అప్పజెప్పమని ఆరాష్ట్ర ప్రభు

త్వాన్ని కోరారు వీల్లేదన్నారు. ఆరాష్ట్ర ప్రభు త్వం కాంగ్రెస్ మంత్రివర్గం చేతులోనున్నందున ఆ అనాథలకు సహాయంచేయ సమకట్టారు. అచట కాంగ్రెస్‌వాదులు పూర్తి సహకారం చేస్తున్నారు ఈ ఒరిస్సా సంస్థానాధిపతుల నిరంకుశంవల్ల వీరంతావలస చేరితేపాపం ఒరిస్సారాష్ట్ర ప్రజలు మాత్రం ఏమిసహాయం చేయగలరు. గాంధిగారు ఇది అన్యాయం అన్నారు. ఇండియా ప్రభుత్వం ప్రజలను బాధించడానికి జోక్యం కలిగించుకుంటుం దని తెలుస్తున్నది. తీవ్ర నిర్బంధాలకు గురిఅగు తున్న తాల్చేరీ ప్రజలు ఇపుడు దుర్భరస్థితిలో ఇండ్లులేక, తిండిలేక, జన్మభూమియున్నా లేక అంగో లక్ష్మణాయని పడిపంచలలో మ్రగ్గిపోవుచున్నారు. సంస్థానాధీశుల నిరంకుశ చర్యలు ఎంతవరకు పోనున్నవో!

## నందగోన్

వై. 871 చ. మై. జనాభా 132, 380 ఆదాయ రు 4, 95 వేలు కప్పం రు 80 వేలు ఫె. ఎ, 1/7 ఫె, కా. 1/4 దీనికి ముఖ్యపట్టణం రాజనందగోన్. ఇచట నొక దూదిమిల్లు కలదు. అచటి కూలీలు బాధలు భరింపలేక తిరుగుబాటు జేసిరి. అంతట కూలీలు సభలుజేసికో కూడదని సంస్థానాధిపతి కూలీల

పౌరసత్వహక్కులను అరికట్టెను. సవాలుగా మిల్లులను మూయించిరి. కొన్ని వేలమంది కూలీలకు అపారనష్టం, తినతిండి, చేయపని లేక పోయెను. గాంధిగారితో సంప్రదింపులు జరిగెను. కూలీలువెళ్ళి మహారాజుతో తమ యిక్కట్టులు, ఫ్యాక్టరీ యజమానులు పెట్టిన బాధలు చెప్పుకొనిరి. అనుకూలమైన జవాబే యివ్వలేదు. నిర్బంధం తప్పలేదు. కార్మికుల స్థితి మరీదుర్భరంగా వున్నది. ఎవరెట్లాపోతే నాకేమన్నట్లు కొన్ని వేలమంది కూలీలు మాడిపోతున్నా చీమున్నా కుట్టినట్లు లెక్కచేయకుండా సంస్థానాధిపతి మానందాల్చాడు. లేక మిల్లువారితో కలిశాడు. నిషేధఉత్తరువులు తిరస్కరించిన కూలీలకు, కూలీబంధువులకు అరెస్టులు శిక్షలు సాగిపోతూనే వున్నవి. ప్రజలలో అభిమానం యేర్పడ్డది. అడవిశాఖలు కాస్తి రైతులుకూడా చైతన్యం వహించి అడవి శాసనాలు ధిక్కరించి సత్యాగ్రహం చేయదలపెట్టినారు సాగించారు జోరుగా సాగుతున్నది. ప్రజాఉద్యమంగా తయారైంది. 1939 జనవరి 15 వ తేదీ నుండి వారం రోజులు హర్తాలు జరిగింది. ద్రుగ్ మ్యునిసిపల్ సభ్యులు 7 గురు రాజీనామా లిచ్చారు. 4 రోజులలో 50 మందిని ఫారెస్టు సత్యాగ్రహంచేస్తే అరెస్టుచేశారు. రాజనందన్‌గోన్ లోని మిల్లు

కూలీలనమ్మొక్కై రూయికర్ వెళ్ళితే రావద్దన్నారు. స్టేటుకాంగ్రెసు ఏర్పడి పౌరసత్వహక్కులకు, బాధ్యతాయుత ప్రభుత్వానికి సత్యాగ్రహం నేటివరకు సాగుతునేవున్నది. ఇది ఇటుజరుగుతుంటే సంస్థానం వారు తమ సంస్థానంలోని ఏడుపరగణాలలో ప్రతి పరగణాకు మూడింట రెండు వంతులు ఎన్నుకోబడేవారు మిగత నిమాయకులు గల ప్రజాసభలు అనుసలహా సంఘాలను నిర్మాణం గావిస్తామని ప్రకటనచేశారు. ప్రజా ప్రతినిధులతో కూడిన కేంద్ర శాసనసభ లేనందున, తమకు జరుగుచున్న అన్యాయాలు, అత్యాచారాలు అరికట్ట బడనందున తీవ్ర ఉద్యమం సాగిపోతూనే వున్నది.

## నీలగిరి

వై. 278 చ. మైళ్ళు. జనాభా 68,594. ఆదాయం రు 1,75,000. కప్పం రు 3,900. ఫై. ఎ. 1/8 ఫై. శా. 1/3. స్థానంకలదు.

ఇదిఒరిస్సా సంస్థానములలోనిది. ఇచటిప్రజలు తమ హక్కులకై ఆందోళనచేయుచున్నారు. సంస్థానాధిపతి వాక్ సభాస్వాతంత్ర్యములు నిషేధించాడు. ప్రజలు సత్యాగ్రహంప్రారంభించారు. లాఠీచార్జీలు కాల్పులు, ప్రయోగించారు. ఒరిస్సాలోని ఇతర సంస్థానాధీశుల సహాయం కోరారు. వారుసహా

యం చేస్తున్నారు. క్రొత్త పోలీసులను దిగుమతి చేశారు. తుపాకులతో కొట్టడం, కాల్చడం - మనుష్యులనుపట్టుకొని దూరాన అడవులలో వదల డం, లాకప్‌లో ఉంచి చావచితక బాదడం, 15 గురు పట్టేగదిలో ఊపిరి సలుపనట్లు జనాన్ని నెట్టి నిర్బంధించటం సాగించారు. దూరప్రాంతాలలోకి బాలురను తీసికొనిపోయి అడవుల్లో వదలడం దెబ్బలు కొట్టడం చూచి అడవిజనమగు సాంతా లులు కూడా ఇది అన్యాయం అని సత్యాగ్రహం ప్రారంభించారు. ప్రజలు తీవ్రంగా పోరాటం సాగిం చారు. ప్రజల ఆస్థులు, జప్తుచేయడం, స్త్రీలను హింసించడం మితిమీరింది. ప్రజలిందుకు దడిచి ఒరిస్సారాష్ట్రంలోవచ్చిపడ్డారు.అక్కడున్నా అరెస్టు చేయాలెనని ఆలోచించారు. ప్రజలు వేలకు వేలు దేశాలు విడిచిపోయారు. అపుడు ప్రజలతో సంస్థా నాధిపతి రాజీపడ్డారు. త్వరలో ప్రజలకోర్కెలు మన్నిస్తానన్నాడు. ఆరాజీ పత్రంపై అచటి బ్రిటిషు ఏజంటుకూడాసంతకం చేశాడు. దానినిమరల 1939 ఫిబ్రవరినెలలోభంగంచేసిఅందరినిఅరెస్టులు, జప్తులు లాఠీచార్జీలు మళ్ళా ప్రారంభించి తీవ్రంగా సాగిం చారు. ప్రజలు తీవ్రంగా నిగ్రహిస్తున్నారు. సత్యా గ్రహం సాగిస్తున్నారు. ఒరిస్సా నాయకులు సాను భూతితో చూస్తున్నారు. బ్రిటిషు ప్రభుత్వం

తాము సంస్థాన అంతరంగిక పాలనలో జోక్యంకలుగ జేసికోం అంటారు. సంధిపత్రంపై సంతకం జేస్తారు. ఆ సంధిపత్రం ఎందుకోసము జరుగలేదో విచారించే దిక్కులేదు. ప్రజలతో సంస్థానాధిపతులు బ్రిటిషు, ప్రతినిధి, చేసికొన్న రాజీషరతులు చెల్లించవలసిన బాధ్యత వారియుపురకు లేకపోతే ప్రజలతో సంబంధమే లేకుండా వారిదివరకు వ్రాసుకున్న ట్రీటీలు అగ్రిమెంట్లు అమలు జరుపవలసిన బాధ్యత ప్రజలది ఎట్లాగైందో తెలియదు. ఇచట తీవ్రపోరాటం ప్రారంభమైనది. అరెస్టులు తీవ్రంగా జరుగుతున్నవి. ఒరిస్సా మంత్రివర్గంకు ఇండియా గవర్నమెంటుకు ఈ విషయంలో తగాదావచ్చే టట్లు కూడావుంది.

## కియోంజహార్

వై. 3906 చ. మై. జనాభా 4 60 609 ఆదాయ 9 15 వేలు కప్పం/1710 ఫై. ఎ. 1 ఫై. కా. 1/5.

ఇది ఒరిస్సాలోని సంస్థానము. రైతులు పన్నుభారం భరించలేక కృంగిపోతున్నారు. చెప్పుకున్నా లాభం కన్పించడంలేదు. తామంతా ఒకచోట సమావేశమై తమ ఈతిబాధలు తీర్చుకోడానికి సంప్రదించుకుందామని తలిచారు. ఈ సమావేశమును ఫణీంద్రనాథ్ పార్ మరియువురు సికిన్దా

ఠాణాకు సంబంధించిన పరియాలో గోవర్ధనపూర్ లో జరుపదలంచిరి. మహాసభకు అన్ని యేర్పాట్లు గావించిరి. ఈ సంస్థానంలోని కొన్ని హక్కులు (ప్రక్కనఉన్న) కటక్ జిల్లా మేజిస్ట్రేటుఅజమాయిషీలో (బళ్ళారి జిల్లాజిడ్జి సాండూరు సంస్థాన ఛీఫ్ జస్టిస్ గా వున్నట్లు) ఉన్నవి. సభసమావేశం కాకముందే ఈ కటక్ జిల్లామేజిస్ట్రేటు అక్కడికి హాజరై సికింధా ధర్మశాల కారై ఠాణాలకు చెందిన ఆవరణలో సభలు, ప్రదర్శనాలు జరుపుటకు వీలులేదని అంద రిపై 144 సెక్షనును ప్రయోగించిరి. ప్రజాందోళన జోరుగా సాగిపోవుచున్నది.

## రాయఘురా

వై. 1486 చ. మై. జనాభా 277569 ఆదా రు483000
కప్పం రు 5500 ఫె. ఎ. 3/7 ఫె. కా. 1/4 స్థానం.

ఇది ఒరిస్సా సంస్థానాల్లోది. ఈ సంస్థానంలో, ప్రజలు పన్నుల భారంవల్లను, రాజకీయ స్వాతంత్రం లేకను ఆందోళనబయలుదేర దీసిరి. దానిని తీవ్రరూపం దాల్చకుండా చేయుటకు అతిమెలకువ గలిగిన తత్సంస్థానాధిపతి ప్రజాపరిషత్తు అనునొక శాసనసభ మాదిరిది యేర్పాటుచేయుటకును తన ఖర్చులను అలవెన్సులను తగ్గించుకొనుటకు నిశ్చయించుకొన్నట్లును, కొన్నిసంస్కరణములు ప్రవేశ

పెట్టుదుననియూ ప్రకటించినాడు. ఈ ప్రజాపరిత్తుకు జిల్లాబోర్డులనుండియు, రెండు మ్యునిసిపాలిటీల నుండియు సభ్యులు తీసికోబడుదురు. శాసనసభాధి కారాలేమో అందలి సభ్యులెందరో వా రేవిధంగా సభ్యత్వం పడయుదురో అందు మూలంగా నిజంగా ప్రజలకెంత ఉపయోగమో వివరములుగల ప్రకట నకై ప్రజలువేచియున్నారు.

## గంగాపూర్

వై. 2492 చ. జనాభా 356674 ఆదా రు 5 20 వేలు కప్పం రు 10 000 ఫె, ఎ. 1 ఫె. కా. 1/5 ప్రజలు ఆందోళన ప్రారంభించారు. ఈ రాజు ఈనడుమ లండన్‌లో గతించెను. వీరి సోదరుడు రాజ్యపీఠము నధిష్ఠించెను. కొన్ని ప్రదేశాలలో వైద్యశాలలయొక్కయు, పాఠశాలలయొక్కయు పన్నును తగ్గింతుమనిరి. రీజంటుగా నున్నవారి తల్లి 170 గ్రామాలలో ఇదివరకు అమలులోనున్న అడవి పుల్లరివసూలును మాఫుజేసెను. ప్రజాపరిషత్తు అను పేరిట శాసనసభనొక దానిని యేర్పరచుటకు, తన స్వంతఅలవెన్సును తగ్గించుకొనుటకును తీర్మానించు కొనినట్లు ప్రకటించెను. ప్రజలలో కొంత చైతన్యం కలిగింది. బాధ్యతాయుత పరిపాలన కావాలెనంటూ ప్రజలు ఆందోళన సాగించుతూన్నారు.

ఇంకా ఎన్నో సంస్థానాలు - - - - - - - - -
ఇంట్లాంటివి మొత్తం ఆరువందలు పైగావున్నాయి.
మరి- మనకు తెలియకుండా పత్రికల్లలో ప్రకటన
లైన లేకుండా, పత్రికలకు కబురే అందకుండా.
బయటివారికే కాకుండా సంస్థానాలలోని వారికేని
తెలియకుండా ఎందరు హింసింపబడుచున్నారో,
ఎందరు అలమటించి పోవుచున్నారో - - - -

ఈ సంస్థానాధీశుల నిరంకుశ దారుణ చర్యల
కంతులేక, భరింపలేక ఎందరో సంస్థాన ప్రజలు బ్రిటిషు
ప్రభుత్వమునకు మనవులు చేసికొనిరి. కష్టాలు తెలియ
జేసికొనిరి. కాని లాభ మేమి? ఇంగ్లాండులోని కొన్ని
పత్రికలు అపుడపుడు సంస్థాన ప్రజలబాధలు విం
తలు విశేషాల క్రింద ప్రకటించుచుండును.

సంస్థానాలలో తీవ్రఉద్యమములు పరువులెత్తి
పోవుచున్న ప్రజాపోరాటములను సాగిపోకుండా
కాంగ్రెసు నాయకులు అడ్డుకట్టలు వేయుసాగిరి.
కాని ఉద్యమము ఈ అడ్డుకట్టకూడాదాటి - చివరకు
కాంగ్రెసు నాయకుల చేతులుకూడా దాటి పోవ
నుండెను. కాంగ్రెసు తటస్థంగావున్న దేగాని ప్రతి
ఒక్క సంస్థానంలోను పనిగట్టుకొని ప్రజాఉద్యమా
లను అణచడానికి ఇంగ్లీంషు ప్రభుత్వం వారు తమ
సైనికదళాలను పంపుటను మాననేలేదు సరికదా -
మితిమీరికూడా పోవుచూ వున్నవి. ఇంగ్లాండు

ప్రభుత్వం అవకాశాలకై ఎదురుచూస్తూ లభించినప్పుడల్లా జోక్యం కలిగించుకొని ప్రజాఉద్యమాలను అణచివేయుచునే యుండెను.

ప్రజలు ఆయాసంస్థానాలలో సంస్కరణలు కావలెనని కోరడం, అందుమీదట ఈ ప్రజావాంఛను నెరవేర్చుటకు కండ్లనీళ్లు తుడుచుటకైనా - ఇంగ్లాండుప్రభుత్వం జోక్యం కలిగించుకోవడం అవసరంఅనే ఆందోళన బలులుదేరగా వింటర్టన్ ప్రభువు 1938 ఫిబ్రవరి 21 న మాట్లాడుతూ సంస్థానాల్లో సంస్కరణలు ప్రవేశపెట్టుట సంస్థానాధీశులయిష్టమేననియు, ఆవిషయం తమ(ఇంగ్లాండుగవర్నమెంటు)కు ప్రసక్తిలేదని చాటాడు. తర్వాత 1938 డిసెంబరు 16 న పార్లమెంటులో సర్ జాన్ వార్డ్లామిల్నీ వేసిన ప్రశ్నకు జవాబుగా ఇండియా సహాయకార్యదర్శి విన్ టర్ టన్ వాదాన్ని బలపరుస్తూ సంస్థానాధిపతులు రాజ్యాంగ సంస్కరణలకై ఎట్టిసూచనలు చేసినప్పటికి బ్రిటిషుప్రభుత్వం అభ్యంతరం కలిగించదు. ఆ విధంగా సంస్కరణలు ప్రవేశపెట్టడానికి ఎలాటి ఒత్తిడిచెయ్యదు. తమ సంస్థానాల ప్రత్యేక పరిస్థితులకు సరిపోయ్యే సంస్కరణములను ఆయా సంస్థానాధీశులే నిర్ణయించుకోవాలె, సంస్థానాలలో దౌర్జన్యం, అశాంతి చెలరేగినపుడు బ్రిటిషు ప్రభుత్వం సాయంచేయవలసిన బాధ్యతవున్నది. సంస్థాన

ప్రజలకు న్యాయంగా జరుగవలసిన కష్టనివారణను గురించి సంస్థానాధీశులకు సలహాయిస్తుంది అన్నాడు. అయితే ఈ సలహామెన్నడు యివ్వలేదుగాని, సహాయం మాత్రం ఎప్పుడూ చేస్తునే వున్నారు.

తర్వాత 1939 ఫిబ్రవరి 20 న సర్ ఆల్ఫ్రెడ్ నాక్సు సంస్థానాల్లో అలజడి చెయ్యడం మానాలని కాంగ్రెస్‌ను ఇండియా ప్రభుత్వం మందలిస్తుందా అని అడుగుతే, పరిస్థితులను కాంగ్రెస్ విశదం చేసుకొన్నదని, ఇండియా ప్రభుత్వం ప్రత్యేకచర్య తీసికోలేదన్న విషయం సంధిషరతులకు భంగకరంగాదని ఇండియా సహాయ కార్యదర్శి అన్నాడు.

ఇండియా కార్యదర్శి జెట్‌లండ్ లివర్‌పూల్ వర్తకమండలివారి విందులో 1939 మార్చి 2 న మాట్లాడుతూ హైదరాబాద్, బరోడా, మైసూరు సంస్థానాల్లో సరియగు పరిపాలన సాగిపోతూన్నదనియు, కొన్ని సంస్థానాలలో సంస్కరణలు అమలుపరచబడి వుందని, అందుకు బ్రిటీషు ప్రభుత్వం సంస్థానాలపై పాలనలో మార్పులు తేవడం అసందర్భంగా వుంటుదని ఇంకా - - - అన్నాడు (ఇది అంతా గాంధిగారు రాజకోటకు వెళ్ళిన తర్వాత అని గమనించాలె.)

ఇక్కడ ఏం చెప్పినా రాజకోట, జయపూర్, ఢెంకనల్, రాన్‌పూరా సంస్థానాలలో బ్రిటిషు

గవర్నమెంటు అన్ని కఠిన చర్యలు తీసికొని ప్రజా ఉద్యమాలను అణగద్రొక్కడం అందరికి తెలిసిందే.

సంస్థానాల్లో ప్రజాపోరాటం రోజురోజు మించిపోతూన్నది. బయటి వారికిసంబంధం వద్దంటూ అడ్డం నిల్చిన పటేల్, నాయకత్వం వహించి గుజరాత్ సంస్థానాలలో ప్రజాఉద్యమం నడుపవలసి వచ్చింది. తనకిష్టమున్నందు తనకన్న కూతురు మణీబెన్ పటేల్ తీవ్రోద్యమానికి రాజకోటలో పురోగామి అయింది. దీనికి విధిలేక నాయకత్వం వహించవలసి వచ్చింది. రాజకోటలో రాజీపడడానికి కాంగ్రెస్ అంగీకరించినా - బ్రిటిషు ఏజంటుస్నా, రెసిడెంటునూ, అంగీకరించినా చివరకు ఏదో రాజీ కుదిరింది. దానిని ఏవిధంగానైనా సరే అమలు జరుగకుండా నిలిపింది, మళ్ళా బ్రిటిషు ఏజంటు, వానికితోడు వీరవాల్లా - వీరిద్దరికితోడు గిబ్సన్, అసలువాడు ఠాకూరుసాహెబ్. తన మాటపోతే తానెందుకా అనేమాటే లేకపోయింది ఠాకూరుసాహెబ్‌కు. అంతటితో రణభేరి మ్రోగింది. సత్యాగ్రహం సాగింది. అరెస్టులు, శిక్షలు, హత్యాకాండ మళ్ళా ప్రారంభమైనాయి.

అటు జయపూర్‌లో ఇంగ్లీషుదివాను పరిపాలనలో క్షామం. క్షామనివారణకు సహాయం

చేద్దామని బజాజ్ బయలుదేరితే - వారిరాకను నిషేధించారు. ప్రజామండలిని అక్రమసంఘం అన్నారు. అరెస్టులు, శిక్షలు, హత్యాకాండ అక్కడా ప్రారంభించారు.

ఇటు ఢెంకానల్, రాన్‌పురాలలో ఇంగ్లాండు ప్రభుత్వం తన సైనిక బలాన్ని వరుసవరుసగ దింపి ప్రజాఉద్యమాన్ని శతఘ్నులతోను, పశుబలం తోను హత మార్చుచున్నారు. ఈ హత్యాకాండకు భరింపలేక అప్పుడే ప్రజలు బ్రిటిషు రాష్ట్రాలలోకి పోయి తలదాచుకుంటున్నారు. తినతిండి లేక పోయినా. నీలగిరి సంస్థానంలో బ్రిటిషుఏజంటు కూడా ఒక పార్టీగా సంతకం చేసిన రాజీషరతులను త్రోసివేసి నిర్ణయభంగాలు గావించుకున్నారు. ప్రజలు, ప్రజలప్రతినిధులు, సంస్థానాధిపతి, ఇంగ్లాండు గవర్నమెంటుతరపున వారిఏజంటు ఇందరు వ్రాసి కొనిన ఖరారునామాలు చెల్లవలసిన పనిలేదు. గాని, ఏనాడో ఇంగ్లీషు గవర్నమెంటూ సంస్థానా ధీశుడు ప్రజలపై కుట్రపన్ని వ్రాసుకొన్న సంధి షరతులు ఈ నాడు ప్రజలకు బాధ్యతయట_ వారేనేర్పారు ఇందరు వ్రాసుకొన్న సంధిష రతులు అసలు లేవు కాపున అనాటి సంధిషర తులు రద్దుఅని. ప్రజలు ప్రకటించాల సిందే, పైగా ఏవరో వ్రాసుకొన్న దానికి ప్రజలకేమి బాధ్యతఅని.

ఈ విధంగా సంధి తప్పిపోయినారు. ఏసంస్థానంలో చూచినా అరాజకం, అశాంతి, హత్యలు, అరెస్టులు ప్రజలకు అవమానాలు నిరంతంగా దుర్భరంగా పెచ్చుపెరిగిపోతూన్నవి. దేశంలో పరిస్థితులుచూస్తే స్వాతంత్ర్యసమరంలో ఎంతో వెనకబడియున్న వను కొన్ని సంస్థానాలు ముందడగువేసి వాయువేగంతో పరువులెత్తుచున్నవి. ఒక్కుమ్మడిగ అన్ని సంస్థా నాల్లో ఆకలి మంటల అగ్నిపర్వతాలు భగ్గుభగ్గున జ్వాలలు జ్వలించుచున్నవి.

## నెహ్రూనాయకత్వం

అందుకనే జవహర్‌లాల్ నెహ్రూ ప్రపం చం చుట్టివచ్చిన వెంటనే "మనసంస్థానాలవంటివి ప్రపంచంలో మరెచ్చటలేవు. ఈ ఆధునిక యుగంలో అభివృద్ధి నిరోధకములగు ఇట్టిసంస్థా నా లుండడం పూర్తిగా అనవసరం" అన్నాడు. ఈ విధమగు ప్రజాఉద్యమములు, రాజకీయ చైతన్యం ప్రబలి ఉబికి ఉద్రూతలూగించుచున్న ఈ అదనులో ఫిబ్రవరి 14 న లూధియానాలో పండిత జవహర లాల్ నెహ్రూ అధ్యక్షతను 6 వ సంస్థాన ప్రజా మహాసభ జరిగింది. అందు నెహ్రూ మాట్లాడుచు ఈనాడు భారత దేశమున స్వాతంత్ర్య పోరాటంలో వెనుకబడి పురోగామిత్వమునకు గుదెబండలుగ నున్నవని తలంచిన సంస్థానాలలోని ప్రజలలో

చైతన్యం కలిగి బ్రిటిషు ఇండియా ప్రజలకన్నను ముందు సాగిపోవుచున్నారనియు, భారతదేశము అఖండ సంపూర్ణ స్వాతంత్రమునకు జయభేరి మ్రోయించి, పోరుసాగించి శాంతియుత సత్యాగ్రహముతో బ్రిటీషువారినుండి, వారిపజంట్లనుండి వారిదాసాన దాసులనుండి ప్రజాసామాన్యము సంపూర్ణ స్వాతంత్ర్యముబడయవలెనని గంభీరముగ సింహగర్జన మొనరించిరి. ఆసభలో ఆయాసంస్థాన పోరాటములను బలపరచుచూ తీర్మానించిరి. సంస్థాన ప్రజామహాసభ కొక కార్యవర్గమును వేసి ఆకార్యవర్గమును, కాంగ్రెస్ కార్యవర్గమును సమ్మిళిగ సంస్థాన ప్రజాఉద్యమమును నడుపుట అనువుగా నుండుననిరి. ఉద్యమాలను ఇంకా తీవ్రంగా నిర్మాణయుతంగా జరుపుటకు నిశ్చయించిరి. వీర జవహర్ లాల్ నాయకత్వము వహించెను. ఈ సంస్థానాల్లో జరిగే పోరాటము సంస్థానాధిపతులతో మాత్రమేకాదనియు, అది బ్రిటిషు సామ్రాజ్య తత్వంతోనని నెహ్రూ హుంకరించెను. మహాత్ముడును నేడు సంస్థానాల్లో జరిగే పోరాటం సంస్థానాధిపతులతో కాదనియు, బ్రిటిషు గవర్నమెంటుతోననియు ఖండితంగా చెప్పెను. బాధ్యతాయుత పరిపాలన అంటే పరిపాలనకు సంబంధించిన

అన్ని వ్యవహారాలు ప్రజలే నిర్వహించుకునే హక్కుగల విధానమని గాంధిగారు వివరించిరి.

మహాత్ముని ప్రాయోపవేశం

మహాత్మాగాంధి సంస్థానాలలో జరుగుచున్న పోరాటాల తీవ్రతచూచి ఈ నాడు తానుపట్టించు కోకపోతే ఆపోరాటం తనచేతులలో నుంచే పోతుం దని, ఇంకా తీవ్రరూపం దాలుస్తుందిఅని, దాని పరి ణామ మెటులుండునోయని జంకాడు. తాటస్థ్యం అవలంబించ వలెననడానికి స్వస్తి చెప్పి, బ్రిటిషుప్రభు త్వం కల్పించు కొంటున్న జోక్యాన్ని ఆసరా తీసి కొని ఇంక తాను సంస్థానాల్లో జోక్యంకల్పించుకోక తప్పదన్నాడు. రాజకోట జయపూర్ సంస్థానాలు రణరంగాలు చేశాడు. జయపూర్ కు బజాజ్ ను పంపాడు అచటి ప్రభుత్వంతో చెరాత్రిపట్లాలు ఆడిస్తు న్నాడు. అరెస్టుచేయడం, వదిలివేయడం మళ్ళా వెళ్ళ డం మళ్ళాఅరెస్టుచేయడం కార్లల్లో త్రిప్పడం. అది యొక బాలక్రీడకింద పరిణతిచెందింది. రాజకీయ పోరాటం ఆటకాయ తనంక్రిందికి దిగింది. అధికారులు సంహించలేక పోయారు. చివరకు అరెస్టు జేశారు.

ఇటురాజకోటలో ఠాకూరుసాహెబు వాగ్దానభంగం. తీవ్రనిర్బంధాలు, జెయిళ్ళల్లో సత్యాగ్రహులనుచిత్రవధలు గావించడం, అమాను

షంగా ప్రవర్తించడం గాంధిమహాత్ముణ్ణి కదిపివేసినై. రోజుకురోజు తనకు చేరుచున్న రిపోర్టులు తనను మరీ కదిలించివేయ మొదలుపెట్టినై. ఈహింసాకాండకు తుదియేమూ నివారణమేమూ యని పరితాపపడ్డాడు తానేస్వయంగా పనికట్టుకొని రాజకోట వెళ్ళాడు. అక్కడి అధికారులతోనూ, జెయిళ్ళలోని ఖైదీలతోనుసంప్రదించాడుమళ్ళారాజీప్రయత్నాలు జరిపాడు. ఈ నాడు కూడా రాజీచెడింది. లాభం లేదన్నాడు. ఈ హత్యాకాండలు, ఈ చిత్రవధలు హింసలు, అరెస్టులుభరించలేనని. దీనికి తుదికన్పించడంలేదనిరి. ప్రజల కధిపతులు సంస్థానాధీసులే, ప్రజలరాజ్యమునకు ధర్మకర్తలుగ నుండేవారే అపభ్రంశాలకు, అసత్యాలకు, వాగ్దానభంగాలకువస్తే ఇంకా గతియేమున్నది అంటూ ఠాకూర్ సాహెబు తన వాగ్దానం - పటేలు పేర్కొన్నవారిని రాజకీయ సంస్కరణల సంఘంలో వేసికొనే – షరతు అమలు అయినా జరుపాలె – లేదా తన ప్రాణాలు అన్నా వదిలెయ్యాలెనంటూ 1939 ఫిబ్రవరి 2 వ తేదీ రాజకోటలో ప్రాయోపవేశం ప్రారంభించాడు.

ఇంతటితో. సంస్థానాలసమస్య ప్రపంచదృష్టి నావరించింది. దేశాన్నంతా అట్టుడికినట్లుడికించింది. ఆరు రాష్ట్రాలలోని కాంగ్రెస్ మంత్రులు రాజీనామాలిస్తామంటూ బ్రిటిషు ప్రభుత్వానికి

హెచ్చరిక యిచ్చారు. విప్లవం - తిరుగుబాటు- అశాంతి - సంస్థానాలలోనే కాకుండా బ్రిటిషు ఇండియాలోకూడా తయారగుచుండెను. అంతటితో పోకుండా అది అంతర్జాతీయ విషమపరిస్థితిగానైనా రావచ్చు - లేదా నేటి అంతర్జాతీయ పరిస్థితులలో ఇదివిషమరూపం దాల్చినైనావచ్చు. ఇండియా సమస్యలంటే చీమకుట్టినట్లున్నా లెక్క చేయని బ్రిటిషు మంత్రివర్గం ఈ సమస్యాపరిష్కారానికి ప్రత్యేక సమావేశం జరిపారు. ఈ సంకటస్థితి తప్పు కుంటానికి ఆలోచనలు చేశారు. పార్లమెంటులో జవాబుచెప్పుతూ ఇండియా సహాయకార్యదర్శి కల్నల్ మూయిర్ హెడ్ అంతర్జాతీయ పరిస్థితులు విషమంగా ఉన్న ఇప్పట్లో ఇండియాలోనొక విషమ పరిస్థితిని ఎదుర్కొనడానికి ఇంగ్లాండుప్రభుత్వం సిద్ధంగాలేదన్నాడు. వైస్రాయి జోక్యంకలుగ చేసికోవలెననుకున్నారు. జోక్యంకలిగించుకోముఅని ఉన్నసంధిషరతులు లెక్కయేమి లెమ్మనుకున్నారు. ఏఇంగ్లాండు ప్రభుత్వం రాజకోట ఠాకూరుసాహెబు పటేల్‌తో రాజీపడుతానంటే వల్లకాదన్నదో, ఏ బ్రిటీషుప్రభుత్వం ఠాకూరుసాహెబు తాను గావించుకొనిన రాజీని అమలుజరుపుతానంటే వల్ల కాదన్నదో, ఏ బ్రిటిషు ప్రభుత్వం గాంధి మహా త్ముడు రాజకోటకువెళ్ళి రాజీలు మార్గాను తే

ఠాకూరు సాహెబును కీలుబొమ్మచేసి ఆడించి రాజీకుదరకుండా పరోక్షంగా వల్లకాదన్నదో - ఆబ్రిటీషు ప్రభుత్వం తనప్రతినిధి వైస్రాయిని జోక్యం కలిగించుకోవలసిందని, ఠాకూరుసాహెబు పటేల్‌తో చేసికొనిన సంధిపత్రంలో సంస్కరణ సంఘ సభ్యులను పటేలు నియమించు షరతు వున్నది లేనిది - ఉన్నచో ఎందరిని నియమించవలె సిందీ ప్రముఖ న్యాయమూర్తులు తేల్చవచ్చునని గాంధిగారి షరతుప్రకారంఫెడరల్ కోర్టుజడ్జికి అప్ప గించవలెనని సలహా యిచ్చారు. వైస్రాయియుఅందు కంగీకరించాడు. ఠాకూరుసాహెబును 'పనికిమాలి నవాడు, తీసివెయ్యండి' - అనిన్ని 'ప్రజల్ని హిం సించాడు, కాంగ్రెస్‌ను మోసంచేశాడు, మర్యాద తెలియనివాడు' అని బ్రిటిషు మంత్రివర్గంవారు మరొక విధంగా ప్రచారం చేత పట్టి చారు

ఈ విధంగా బ్రిటిషుగవర్నమెంటు నాటక మాడుతున్నా, ఈ సంస్థానాధిపతులు కొంచెమైనను వివేకములేక, ఇంకా ఆబ్రిటిషుగవర్నమెంటు అండ జేరి తమ బిరుదుబిరాణాలు, తమ గౌరవమర్యాదలు రక్షిస్తారని - రక్షించుకోవాలెనని, నాదిరపడి పంచల దాసులై బ్రతుకుదామను మనోభావమును వీడ కున్నారు. 'తీసివెయ్యండి' అని ప్రచారం సాగించిన తర్వాత ఈ రాజ్యాధిపత్యం ఠాకూరుసాహెబుకు

ఉంటుందా? నాభాగతియేమి. మరియెందరోసంస్థానాధీశులను తొలగించలేదా - ఇంక వీరినుండనిత్తురా? ఇటు ప్రజాలా తీవ్రాందోళన సాగించి ఈ నాడు కాకున్న రేపైననుతమప్రజారాజ్యము (Republic) ను తాము బడయక మానరు, ఆనాడైనను వీరికి రాజ్యముదక్కనేరదు. ఈ నాటికైనను తమ సంస్థానాధిపతులు అధికారములను ఐచ్ఛికంగా ప్రజాధీనంచేసి, రాజ్యపీఠమును త్యజించి సామన్య పౌరులై గౌరవనీయులై వివేకవంతులై మనుట శ్రేయము.

ఈ వైస్రాయి హామీతో మహాత్మాగాంధి 6 వ దినము (7—3—39) న ప్రాయోపవేశమును చాలించెను. సంస్థానాధీశులకు తలవాపులు తెచ్చెను. బ్రిటిషు ప్రభుత్వమును వారి సంధిషరతులను, వారిని అంటిపెట్టుకొని నమ్ముకొనియున్న సంస్థానాధీశులకు గుణపాఠము నేర్పెను నిరంకుశ పరిపాలనకు హెచ్చరిక యిచ్చెను. తమ సంధిషరతుల ప్రకారం సంస్థానాంతరంగిక పరిపాలనలో జోక్యం కల్గించుకొన బోవమని చెప్పినను షరతుల శాశ్వతము అంటే తమకు అచ్చివచ్చినన్నాళ్లు అని మొదటిలోనే చెప్పినట్లున్నూ, ఈ నడుమ మాల్కంమాగ్గొనాల్డు చెప్పినటుల ఆంగ్లసామ్రాజ్యము కళలబాయుచుండుటచేతను- ఆకళలను నిలుపుకొను

టకు ఎన్ని సంధిషరతులు - వాగ్దానాలు, ఎందరు కర్జాలు ఆస్తిపాస్తులు బలియయ్యారే బ్రిటిషు సామ్రాజ్యవాదులు ?

గాంధిమహాత్ముని ప్రాయోపవేశంతో వైస్రాయి జోక్యం కలిగించుకోవడంతో, సంస్థానాల సమస్య రూపుమారింది. రచ్చకెక్కింది. జయపూర్, నీలగిరులల్లో ప్రజామండలులపై నిషేధంతొలగింది. ఢోకనల్ సంస్థానాధిపతిని ఇంగ్లాండుకుపంపే (పదచ్యుతుణ్ణిచేసే) ఆలోచనలో పడ్డది. ఇంకోవైపు తిరువాన్కూరులోని పరిస్థితులు విషమరూపం దాల్చడంవల్ల ఏప్రిల్‌నుండి సత్యాగ్రహంచేయ నిశ్చయించి తుదిసందేశం ప్రకటించారు. మైసూరులో స్టేటుకాంగ్రెస్ సత్యాగ్రహం ప్రకటించింది. కాంగ్రెస్ ఆజ్ఞమీర స్థానికసంస్థల సభ్యులు, శాసనసభా సభ్యులు రాజీనామాలీయడం - అరెస్టులు - సాగాయి.

## త్రిపురి కాంగ్రెస్

ఇది ఇటులుండగా, ఎన్నో వాగ్వాదాలలో ఎన్నో అవాంతరాలలో త్రిపురిలో సుభాష్‌చంద్ర బోస్ అధ్యక్షతను మార్చి 10-12 (1939)ల లో కాంగ్రెస్ మహాసభ జరిగింది. భారత జాతీయ వాంఛ (నేషనల్ డిమాండ్) ను ప్రకటించింది.

సంపూర్ణ స్వాతంత్ర్యం భారతీయుల జన్మహక్కని మరల ప్రకటించింది. మహాత్ముని రాజకోట విజయానికి సంతసించింది. ఉదారంగా ప్రవర్తించిన సంస్థానాధీశులను అభినందించింది. 'సంస్థానాలతో కూడుకున్న యావద్భారత దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదన కాంగ్రెస్ లక్ష్యమై యుండుటచే ఈ లక్ష్యమును సాధించుటకు అనుకూలమగు విధానమును ఎప్పటికప్పుడు నిర్ణయించుటకు కాంగ్రెస్ మహాసభ వారు కార్యసంఘమున కధికారమిస్తూ' తీర్మానించారు. సంస్థానాలలోని కార్యక్రమం కూడా జరుపవలసినదిగా నిర్ణయించారు. సంస్థానాల్లో ప్రజామండలులే అచటి ఉద్యమాలను నడిపించాలెనన్నారు.

ఎప్పుడైతే కాంగ్రెసు తనమూకీభావమును వీడి సంస్థానాల విషయం కూడా నిర్ణయించడానికి కార్యసంఘానికి అనుమతి యిచ్చిందో, అంతటితో అందరియొక్క ధోరణిమారింది. సంస్థానాధీశులు కాంగ్రెసు జరిగిన మరుదినమే(అంటే 13న) ఢిల్లీలో నరేంద్రమండలి వార్షికసమావేశం పేరటగుమికూడారు. ముందేమి చేయుడమా అని ఆలోచిస్తున్నారు. ఈ సమావేశాన్ని ప్రారంభిస్తూ వైస్రాయి లిన్‌లిత్‌గో ప్రజల ఇబ్బందులు తొలగించక తప్పదని హెచ్చరిస్తూ, చిరకాలమునుండి వంశ

పారంపర్యంగా వస్తూన్న సంస్థానాలకు తామే రక్షకుల మని తలంచరాదని హెచ్చరించాడు. అందరికీ అంగీ కారయోగ్యమైన అంగీకార పత్రాన్ని తయారు చేశా మన్నాడు. దానిని బాగా ఆలోచించి త్వరలో ఫెడరేషనులో చేరే సంగతి తేల్చుకోవలసిందని వ్యంగ్యంగా బెదరించాడు.

పరస్పర సమాలోచనలతో కట్టుబాటుతో తమ అధికారాలు నిల్పుకోవాలెనని సంస్థా నాధిపతులును; తలబిరుసు సంస్థానాధిపతి వుంటే అదరించి బెదరించి ఫెడరేషనులో చేర్చుకోవాలె నని వైస్రాయి తీవ్రప్రయత్నాలు సాగిస్తూవున్నారు. ఈ ఫెడరేషనును ఏవిధంగానైనా సరే బ్రద్దలు కొట్ట వలసిందే నంటూమళ్ళా కాంగ్రెసు త్రిపురిలో తీర్మా నించింది. ఆప్రకారం ఫెడరేషను విధ్వంసం చేయా లెనంటె ఈ సంస్థానాధిపతులున్నూ ఇంగ్లాండుగవ ర్నమెంటున్నూ ఆడుతూన్న నాటకాన్ని - ఆటకట్టిం చాలె నంటే సంస్థానాధిపతులతో, వారికిమద్దతుగా వున్న బ్రిటిషు సామ్రాజ్యంతో సంస్థానప్రజలున్ను; బ్రిటిషు ప్రభుత్వంతో బ్రిటిషుఇండియాలోని ప్రజ లునుఒక్కసారిగా ఎదుర్కోవడానికి తీవ్రప్రజా ఉద్యమాన్ని బయలు దేర దీయాలె. క్రమశిక్షణ ఉండాలి. నిర్మాణయుతంగా నడపాలె. ఇందుకు కార్యక్రమం నిర్ణయించడానికి త్రిపురికాంగ్రెసు

కార్యవర్గాని కధికారమిచ్చింది. మన మే యేఎత్తులు వేస్తామో ముందుగానే ఎందుకు చెప్పవలెనంటూ జవహర్‌లాల్ నెహ్రూ దూరదృష్టిచూపాడు.

ఫెడరేషను ధ్వంసంచేయడానికి రానున్న పోరాటంలో 37 కోట్ల భారతీయులు ఐక్యకంఠంతో చేతులుకలిపి పనిచేయాలె. అందుకొక నిర్ణీతఆదర్శ మిస్తేనేగాని ప్రజలలో ఒక కార్యక్రమం సాగనేరదు. కాంగ్రెసు సంపూర్ణస్వాతంత్ర్యం మనఆదర్శమన్ననే స్వాతంత్ర్య సంగ్రామం బ్రిటీషుఇండియాలో తీవ్రంగా సాగింది. 'సంస్థానాధీశుల పాలనక్రింద' అనే మాట తమ ఆదర్శంలో తీసివేసిన తర్వాతనే సంస్థానాల్లో ప్రజాఉద్యమాలు బాగా విజృంభించాయి. అందుచేత నిర్ణీత ఆదర్శము సంస్థానప్రజలతో కూడిన భారతీయులకు సమిష్టిగయివ్వవలెను. ఈనాడుమరల జాతీయవాంఛను వెలువరుస్తూ ప్రజామండలి (కాన్‌స్టిట్యుయంట్ ఎసెంబ్లీ) ద్వారా నిర్ణయింపబడిన రాజ్యాంగమే, అంటే స్వయంనిర్ణయం అయిన రాజ్యాంగమే – సంపూర్ణ స్వాతంత్ర్యమే ఆదర్శమని త్రిపురిలో మరొకమారు బహిరంగంగా ప్రకటించారు; కొందరు సంస్థానాధీశులను అభినందించారు; ప్రజలకు బాధ్యతాయుత పరిపాలన నొసంగవలెనని సంస్థానాధీశులను కోరుచు తీర్మానం

చేశారు. ఇందువల్ల సంస్థానప్రజల భవితవ్యం బోధ పడడం లేదు. సంస్థానాధీశుల ఉనికి వివరించబడ లేదు.

సంస్థానాధీశులు ప్రజల సొత్తుకు ధర్మకర్తలుగనుండి దానిపరిపాలన రామరాజ్యంగా సాగించవలెనని గాంధిమహాత్ముడన్నారు. హోసకప్ప కృష్ణారావు వ్రాసిన 'స్వరాజ్య రాజ్యాంగము' Swarajaya Constitution లో సంస్థానాధీశులను ఆయా ప్రాంతాలకు వంశపారంపర్య గవర్నరులుగ ఏర్పరచడం మంచిదన్నారు. వంశపారంపర్యంగా వస్తున్న సంస్థానాలకు తామే ప్రధాన సంరక్షకులమనే భావం పనికిరాదని వైస్రాయి లిన్లిత్ గో (13-3-39) న అన్నారు విజయనగరం కుమారరాజా రాజాసాహెబుల మహాసభలో 1938 నవంబరు (?) లో మాట్లాడుతూ ఈసంస్థానాలవల్ల తమకూ ప్రయోజనం లేనందున - తమకుకొంత ప్రతిఫలంయిచ్చి వీనిని ప్రభుత్వమే స్వాధీన పరచుకుంటే ఏదో కాలక్షేపం చేస్తామన్నారు. ప్రకాశం రిపోర్టుపై మాట్లాడుచు (27-1-39) న ప్రధాని రాజాజీ జమీందారులకు కంపెన్సేషన్ ఇవ్వవలసిన అవసరం లేదన్నారు. దర్బార్ గోపాల్ దాసు లిండిలో సంస్థానప్రజల కుపన్యసిస్తూ సంస్థానాధీశులు ప్రజలకు బాధ్యతాయుత పరిపాలన యివ్వనిచో సంస్థానాలు నామరూపాలు లేకుండా పోతాయన్నారు. జవహర్‌లాల్ నెహ్రూ

ఈఆధునిక యుగంలో అభివృద్ధి నిరోధకములగు ఈ సంస్థానాలుండడం పూర్తిగాఅనవసరంఅనిచాటారు. సంస్థానాలలోని ప్రజలు తమకెట్టి రాజరికము కావలెనో తామే నిర్ణయించుకుండే హక్కు ఉండాలెనంటున్నారు. ప్రపంచ యుద్ధానంతరం అన్ని దేశములును అన్నిరాజ్యాంగములును స్వయం నిర్ణయ సూత్రముపైననే పాలింపబడవలెనని, నిర్మింపబడవలెనని, విల్సన్ నిర్ణయించినాడు. కాంగ్రెస్ అఖిల భారతదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమే ఆదర్శమనినది.

ఇన్నింటిని ఆలోచించి చూడగా గాంధీ మహాత్ముడన్నట్లు సంస్థానాధిపతులు ధర్మకర్తలుగ వుండతగరని రాజకోట వ్యవహారంతో తేలిపోయింది కనుకను, జవహరలాల్ చెప్పినట్లు సంస్థానాలు అనవసరం కనుకను, కంపెన్‌సేషన్ ఇస్తే సంస్థానాలు ప్రభుత్వానికే వదిలివేస్తామని విజయనగరం కుమారరాజా అన్నారుగనుకను, కంపెన్ సేషన్ యివ్వవలసిన అవసరం లేదని రాజాజీ అన్నారు కావునను, వంశపారంపర్యంగా వస్తున్నంత మాత్రాన తామే ప్రధానులమని భావించరాదని వైస్రాయి అన్న దున హొసకప్ప కృష్ణారావు చెప్పినట్లు వంశపారంపర్య గవర్నరుగ వుంచవలసిన అవసరం లేనుగావునను, సంస్థానప్రజలు సంపూర్ణ

బాధ్యతాయుత పరిపాలనఅంటే రాజ్యాంగపరిపాలనకు సంబందించిన అన్నివ్యవహారాలలో ప్రజలకు బాధ్యత కలిగియుండుటయేయని మహాత్మా గాంధీ అన్నారు కావునను సంస్థానాధీశులను తొలగించి ప్రజాపరిపాలన నెలకొల్పవలెను. ఈ సంస్థానములన్నియు స్వతంత్ర ప్రజారాజ్యములు కావలెను. నేడు బ్రిటిషు ఇండియా అని వ్యవహరింపబడు రాష్ట్రములను, నేడు సంస్థానాధీశులక్రింద నున్న సంస్థాన ప్రాంతాలను, భారతదేశంలో ఇంకా మిగిలియున్న ప్రాంతాలను అన్నింటినికలిపి భాషా ప్రయుక్తముగ రాష్ట్ర పునర్విభజన మొనరించి అఖండ హిందూస్థాన ప్రజారాజ్యము(Hindustan Republic) ప్రకటింపవలెను. ఇదియేమనఆదర్శము.

శాంతియుత మైనట్టియు, సవ్యమైనట్టియు సకలసాధనలచేత ప్రజాశక్తిని సంఘటిత మొనర్చి సుశిక్షణతో ప్రజావిప్లవమును ప్రజ్వరిల్లజేసి భారత దేశము నంతటిని ఒకేఒక ప్రజారాజ్యముగ అఖండ భారత ప్రజారాజ్యముగ చేయువలెను.

అఖండమైన భారతదేశమును అనేక విభాగములుగ విభజింపబడి విభేదసూత్రములవలనను, కుటిల రాజనీతివలనను, కుతంత్రములవలనను, భారతీయులు ఈ భారతభూమియందే, ఒకవైపు బ్రిటిషురాష్ట్రములని గవర్నరులక్రిందను, వానిని నడుపుచున్నఇంగ్లాండు

ప్రభుత్వంచేతను; మరొకవైపు సంస్థానములని సంస్థానాధీశుల క్రిందను, వారిని ఆడించే ఇంగ్లీషు ప్రభుత్వం చేతను; మరొకవైపు కొంతమినహాయించిన ప్రాంతాలని - అంతామినహాయించిన ప్రాంతాలని అచటి ముతాదారుల క్రింద, వారిని నడిపేఅధికారుల క్రిందను, ఇద్దరిని నడిపే ఇంగ్లాండు ప్రభుత్వచేతను; మరొకవైపు (బెలుచిస్థాన్ వగైరా) అడ్మినిస్ట్రేటివ్ ప్రాంతాలు అనుపేరిట మిలిటరీవారిక్రింద - కమీషనర్ క్రింద, వీరినినడిపే ఇంగ్లాండుప్రభుత్వం క్రింద - అన్నిప్రాంతాలలో బ్రిటిషుసామ్రాజ్యము క్రింద అనేక తరహాలుగా బాధింపబడుచున్నారు. హింసింపబడుచున్నారు. స్వతంత్రతాహీనులై బానిసలై మనుచున్నారు. ఏప్రాంతంలోవారు ఆప్రాంతంలో తమ నిర్బంధాలు రూపుమాసి స్వాతంత్ర్యం కావలెనంటున్నారు. అందుకై అనేక స్వాతంత్ర్య పోరాటాలు సాగిస్తున్నారు. 'వానియొక్క స్వరూపములు, సంగ్రామరంగాలు భేదించినను, స్వాతంత్ర్య సముపార్జనమునకు చేయు వివిధదీర్ఘసంగ్రామములు లేవనియు, అన్నియు సర్వశక్తివంతమైన ఏకైకభారత స్వాతంత్ర్యసంగ్రామమేనని జవహర్‌లాల్ ప్రవచించాడు మహాత్ముడు నుడివినట్లు స్వేచ్ఛకొరకు ఎచట పోరాటము సాగినను అది అఖిలభారత పోరాటమే!

ఈపోరాటములన్నియు ఏకైక ఆదర్శమునకై సాగిపోవలసినదే. పరులోసంగు శాసనరాజ్యాంగము పనికిరాదు. యుక్తవయస్సువచ్చిన ప్రతి భారతీయునిచే ఎన్నుకోబడిన ప్రజామండలి నిర్ణయించు స్వేచ్ఛమైన జాతీయమైన స్వదేశీయమైన 'హిందూస్థాన్ పంచాయత్' సాధించువరకు ఈస్వాతంత్ర్య పోరాటము సాగిపోవలసినదే. అన్నిప్రాంతముల భారతీయులు సమ్మిళితమై ఏకైక పోరాటమును - ఏకైక ఆదర్శమునకై తీవ్ర తరమగు పోరాటమును సాగించవలెను.అట్టి పవిత్రఆదర్శమును పొందుటకు ఎట్టిత్యాగమునకైనను సంసిద్ధులుగండు! తినుటకు తిండిలేక, తిరుగుటకు స్వేచ్ఛలేక, కడగండ్లు తెల్పుకొనుటకు స్వాతంత్ర్యంలేక, కూడబలుకుకొనుటకు కూటములేక, ఆకలిమంటలచే, నిరుద్యోగముచే, పన్నుల భారముచే బ్రిటిషు సామ్రాజ్య రథచక్రములక్రింద నలిగిపోవుచున్న బాధితులెల్లరు లెండు! భారతదేశము నాదని, భారతీయుడను నేనని, భేరికాడాండ డడాండ నినదంబు లజాండమునిండ మత్తవేదండము నెక్కి చాటుడు, భారతదేశ ప్రజాస్వామికమును బడయగోరి, మహాత్ముని ఆదేశమునను సరించి, వీరజవహరుని అధ్వర్యమున సుభాసు నాయకత్వమున రానున్న స్వాతంత్ర్య విప్లవములో భారతస్వాతంత్ర్యమును బడయుడు. లెండు _ ఈఅదను పోనీయకుడు.

నిర్మాణబలమును సంఘటించుడు. క్రమశిక్షణ నలవరచుకొనుడు. సంఘశక్తిని ప్రబలపరుపుడు. ఈ హింసా విధానమును - ఈ హత్యాకాండను తుదిముట్టించి, శాంతి స్థాపింపుడు. ఇంటింటా కంటి కగుపడక కుమిలిపోవుచున్న ఆకలిమంటల దహన జ్వాలలను ఆర్పలెండు! సుఖలాలసులకడకు - వివిధ దేశములకు - సామ్రాజ్యవాదులు నడుపు ఆర్థిక ప్రవాహమును ఈ ఆకలిమంటలపై ప్రవహింపజేసి శాంతి చేకూర్చుడు. ఈ హింసలు సహించలేమని తెలుపుడు - శాంతియె ఆదర్శమని అట్టిశాంతికి - అట్టి ప్రపంచశాంతికి - అంతర్భాగమైన భారతదేశ శాంతికై లెండు! - లేలెండు!!

ఆకలిమంటుచే మలమలమాడే అనాథలంతా లేవండోయ్
హింసారతినిసహించగలేక ఈసడించినది ధర్మంబెల్లా
మంచిదినాలూ రానున్నాయీ మనకందరకును
—లేవండోయ్! లేవండోయ్!

స్వతంత్ర భారత్‌కీ జై!

"విప్లవం వర్థిల్లాలె!"

*

# సహాయపడిన గ్రంథాలు

కాంగ్రెస్ చరిత్ర — (1935) డా. భో. పట్టాభిసీతారామయ్య
బ్రిటిషు రాజ్యతంత్రము — (1938) దిగవల్లి వెంకటశివరావు.
బ్రిటిషు ఇండియా చరిత్ర (1938) ,,
హిందూమహాయుగము (1910) కే. వి. లక్ష్మణరావు
ఆంగ్ల రాజ్యస్థాపన [1936] మానికొండ సత్యనారాయణశాస్త్రి
బ్రిటిషు మహాయుగము — (1938 - 39) ,,
స్వదేశీ సంస్థానములు — (1938) నార్లవెంకటేశ్వరరావు
నేటిభారత రాజ్యాంగము [1936] రె. మందేశ్వరశర్మ.
నూతనరాజ్యాంగవిధానము — [1936] కా. పూర్ణమల్లిఖార్జునుడు
నూతనరాజ్యాంగవిధానము — (1936) త. జగన్నాధరావు
ఇండియా రాజ్యాంగము — [1935] దిగవల్లి వెంకటశివరావు
నవశక్తి త్రిపురిసంచిక
Nehru Committee Report [1928]
Butler Committee Report [1929]
Simon Commission Report [1930]
Round table Conferences Porceedings [1930 - 32]
Indian States Enquiry Committee [Financial] Report [1932]
Indian Constitution [1919] Barkat Ali
White Paper [1933]
Auto Biography [1935] Pandit Jawaharlal Nehru

Recent Essays [1935] by Jawaharlal
Joint Parliamentary Committee Report [1935]
Government of India Act [1935]
Memoranda on Indian States [1936]
States Peoples Conferences Presidential Addresses
His Highness [1930] KanhayalalGowba
Great Expectations [1937] Hydrabad Bullitain
Fedaral Structure [1938] K. T. Shah
Peep Into Hydrabad [1938]
Hydrabad Congrees Bullitians [1938]
Hindustan Year Book [1939]